శ్రీ గురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము

## ఉపదేశము-ఉపాసన - వేదాంత విచారణ సరళి




పరిపూర్ణ దర్శనాచార్య సదానంద

శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు గారు

వీరి ధర్మపత్ని సీతామహాలక్ష్మమ్మ గారు

సంకలనం : శ్రీ విజ్ఞానానంద మంచిరాజు శ్రీనివాస మూర్తి





వెల : రూ॥25/-

మొదటి ముద్రణ

# ముందుమాట

శ్రీమద్రామడుగు శివరామ దీక్షిత అచలగురు పీఠ ప్రతిష్టాపనా చార్యులు, ఏతత్ పీఠాధ్యక్షులు అయిన, అచలఋషి దయానంద శ్రీ పొన్నాల రాజయోగీంద్రులవారి శిష్య మండలిలో "పరిపూర్ణ దర్శనాచార్య" "సదానంద" శ్రీ యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు గారు, వీరి ధర్మపత్ని సీతామహాలక్ష్మి గారు అగ్రగణ్యులు. వీరి గురుదేవుల అనుగ్రహానికి పాత్రులై, శివరామ దీక్షిత సిద్ధాంతమును, అందలి విలువలను గురు ప్రబోధ ద్వారా, వస్తు నిశ్చయపూర్వక ముగా, ధృఢ పరచుకొని, వారి జన్మను ధన్యత గావించుకొన్న పుణ్యపురుషులు. పరిపూర్ణ సిద్ధాంతమును సమాజములోని జిజ్ఞాసులకు ఉపదేశించి, విరివిగా ప్రచారము గావించిరి. అంతేకాక స్వయంకృషితో భారతీయ తత్వశాస్త్రమందలి సోపానములు అయిన షడ్దర్శనములు, ఉపనిషత్తు సాహిత్యము నందలి విలువలు, వివిధ మతములు, అందలి అంతర్గత దశలు, వైజ్ఞానికముగా జతచేసి తాము గురు ముఖత: విన్న, పరిపూర్ణ భావమును జతపర్చి స్వీయానుభవముతో "పరిపూర్ణ దర్శనము" అను సిద్ధాంత గ్రంధమును, రచించి సిద్ధాంతముపట్ల జిజ్ఞాస లోకమునకు ఈ భావమును అందించుటలో కృత్యకృత్యులైరి. అంతేకాక "రాజయోగి" అను పేరుతో వేదాంత మాసపత్రికను నిరాటంకముగా 12 సం॥లు నిర్వహించి, పాఠకలోకమునకు అచల పరిపూర్ణ సిద్ధాంతము పట్ల స్పష్టమైన అవగాహన, ఆలోచన కలిగించుటకు ప్రయత్నించిరి. వారి జీవనకాలములో చివరి శ్వాసవరకు, గురు ధర్మమును ప్రచారము గావించి గురు ఋణమును తీర్చుకున్నవారైరి. వారి ఆశయ సిద్ధి నిర్వహించి, కొనసాగించుటకు, ఒక బలమైన

భక్తమండలిని వారి జీవన కాలములోనే తీర్చిదిద్దియున్నారు. వారి భౌతిక జీవనానంతరము, వారి శిష్యమండలి కంకణబద్ధులై గురుదేవుల ఆశయ సిద్ధికి "శ్రీ శ్రీ శ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ భోధోపదేశ మందిర సంస్థ" ను 1991 సం॥లో గుంటూరు జిల్లా, మంగళగిరి మండలం, యర్రబాలెం గ్రామము కేంద్రముగా అన్ని హంగులతో వసతులతో, మందిర నిర్మాణము గావింపబడినది. అందు గురుపీఠ యంత్ర ప్రతిష్ఠాకార్యక్రమము 12-08-1992 సం॥లో, సాంప్రదాయబద్ధంగా ఏర్పాటు చేయబడినది. అంతేకాక రాష్ట్రమందుగల విరివిగావున్న భక్తమండలి కృషి సౌలభ్యము కొరకు పశ్చిమగోదావరి జిల్లా నర్సాపురంలోనూ, నిజామాబాద్ పట్నంలోనూ, నల్గొండ జిల్లా గరిడేపల్లి గ్రామంలోనూ, మెదక్ జిల్లా శాలిపేట గ్రామంలోనూ, ప్రకాశం జిల్లా నికరంపల్లి గ్రామంలోనూ, కృష్ణా జిల్లా నీలిపూడి గ్రామంలోనూ, పై సంస్థకు అనుబంధంగా మందిర నిర్మాణములు గావింపబడి, అందు గురు పీఠయంత్ర ప్రతిష్ఠాపన గావించి, సాంప్రదాయ పద్ధతిగా గురూపాసనవిధానము నిర్వహింపబడుటకుగాను, అన్ని సదుపాయాలతో భక్తాదుల ఆర్థిక సహాయ సంపత్తితో ఏర్పాటు చేయబడినది. శ్రీరామచంద్రరావు గారి దంపతుల ఆశయాలు బీజప్రాయముగానున్న దశనుండి క్రమక్రమముగా వృక్షాకృతి వహించి బాహుముఖంగా విస్తరించి ఫలప్రదమై, ఆసక్తి జనుల హృదయాలలో సుస్థిర స్థానము సంపాదించుకొనియున్నది. వీరి ఆదర్శవంతమైన కృషియందు మూడు ముఖ్యాంశములు ప్రధాన భూమికగాయున్నవి. 1) అనుష్టానము, 2) ఆచరణ, 3) విచారణ.

ఈ అంశములపై సమాజములోఈ సాంప్రదాయము పేరున కృషి చేసేవారు, భిన్న భిన్న అభిప్రాయములు కలిగియుండుట, సాంప్రదాయము భిన్న

మార్గములుగా వున్న ప్రచార సరళిని కలిగియుండుటలో జిజ్ఞాస లోకము అయోమయంలో పడియుండుట వీరు గమనించి, సనాతనమైన, సాంప్రదాయబద్ధమైన పరిపూర్ణ సిద్ధాంతమును, సిద్ధాంత పద్ధతితో పాటుగా ఉపదేశ పద్ధతిగా నేటి సమాజానికి, సమకాలిక విధంగా ఆచరణాత్మకమై, ఆదర్శవంతమైన జీవితాన్ని వారు నిర్వర్తించుటయేగాక వారి భక్తమండలిని ఈ అంశములందు నిష్ణాతులనుగావించియున్నారు. అందు ప్రముఖమైనది గురూపాసన, గురు గీతాధర్మము. ఇది ఇహపర సాధనము, ఐహ్మిక, ఆముష్మిక పురోభివృద్ధితో భుక్తిముక్తి క్రియలందు పరిపూర్ణత్వమును ధృడపరచుకొను విధానమును నిర్దేశించియున్నది. ఈ సంస్థ నిర్మాణములో కీలకాంశము ఇదియే. ఇందలి దశలు, పూర్వాపరాలు "పరిపూర్ణ సిద్ధాంతము అందలి విచారణ సరళి" అను మకుటముతో గ్రంధ రచన గావింపబడుచున్నది.

శ్రీ రామచంద్రరావుగారు శ్రీ దయానంద రాజయోగీంద్రుల వారి అనుగ్రహంతో దీక్షిత సాంప్రదాయమును తన గ్రంధ రచనల ద్వారా బహుళ ప్రాచుర్యము చేసి పాటక లోకమునకు ఉత్తేజితులుగా చేసి వారిని జాగృతం గావించియున్నారు. వారి శిష్యప్రశిష్యులు అందుకు వలయు ఆర్ధిక సంపత్తిని సమకూర్చి వారి గురుభక్తిని వ్యక్త పరచుకొనేయున్నారు. శ్రీ రామచంద్రరావు గారి రచనలన్నియు వారి గురుదేవులు శ్రీ దయానంద రాజయోగీంద్రుల వారి దివ్య చరణములకు పూజా పుష్పములుగా సమర్పింపబడియున్నవి. అట్లే ఈ భాగం కూడా పూజా పుష్పంగా వారి చరణ సన్నిధికి చేరాలని భక్తమండలి తరపున శ్రీ గురు పరమాత్మను ప్రార్ధించుచున్నాను. ఈ గ్రంధమును ముద్రించుటకు ఆర్ధిక సహాయము అందించిన చి॥ సద్గుణానంద కాంద్రు విష్ణుకుమార్ దంపతులకు

శ్రీ గురుపరమాత్మ అనుగ్రహం కలిగి అభీష్టసిద్ధి కావించగలరు. వీరి సంగ్రహ జీవిత చరిత్ర అన్యత్ర ప్రకటింపబడును.

----------- 0 -----------

ఇట్లు

మంచిరాజు శ్రీనివాసుమూర్తి,

సంకలన కర్త .

## విషయ సూచిక

## ఈ గ్రంథ ముద్రణకు ద్రవ్య సహాయం చేసిన శ్రీమతి లక్ష్మి విష్ణుకుమార్ గార్ల సంగ్రహ జీవిత చరిత్ర

గుంటూరుజిల్లా, మంగళగిరిపట్టణములో దూర్వాస వంశోద్భవులైన కాంద్రువారి వంశం పేరెన్నికగన్నది. అందు కాంద్రు శ్రీశైలం-రాములమ్మ అను పుణ్యదంపతులకు జ్యేష్ఠకుమారుడు సూర్యప్రకాశరావు, వీరి సతీమణిమురళీదేవి అను పుణ్యదంపతుల గర్భవాసమున 14-3-1968 (ఫాల్గుణ పౌర్ణమి) జ్యేష్ఠపుత్రునిగా చి॥ విష్ణుకుమార్ జన్మించిరి. వీరి తల్లిదండ్రులు బీదకుటుంబమునకు చెందిన వారైననూ, కుటుంబమును ఎంతో బాధ్యతతో తీర్చిదిద్దిరి. చి॥ విష్ణుకుమార్ ఆరవ తరగతి వరకు మాత్రమే చదివి తదుపరి చదువులకు స్వస్తిచెప్పి సమీపములోనున్న విజయవాడ చేరుకుని మేనమామ వద్ద బంగారు నగల తయారీ చేతివృత్తిలో శిక్షణపొందుచూ, యుక్త వయస్సు రాగానే గుంటూరుజిల్లా, ఐలారం గ్రామకాపురస్తులు శ్రీకొండాసీతారామయ్య, సీతామహాలక్ష్మి దంపతుల కనిష్ఠపుత్రిక చి.సౌ. లక్ష్మితో ది. 8-04-1990 సం.రం.లో వివాహము జరిగినది. వీరికి నవీన్, తేజ అను ఇరువురు కుమారులు కలిగిరి. పూర్వజన్మ సుకృతము, దైవబలముతో అంచెలంచెలుగా అభివృద్ధి సాధిస్తూ స్వంతంగా బంగారునగల తయారీ వర్క్‌షాపు ప్రారంభించి, కొంత మందికి ఉపాధి కల్పించుటలో కూడా తోడ్పడిరి. పూర్వజన్మ పుణ్యవిశేషముచే బాల్యమునుండి ఆధ్యాత్మిక చింతనయందు జిజ్ఞాసకలిగి, పెద్దల సాంగత్యముచే తంత్రవిద్యలో ప్రావీణ్యముకల్గిన శ్రీసుబ్రహ్మణ్యశర్మ(కేరళ) వారి శిక్షణలో కఠినమైన యోగతంత్ర సాధనలు 3సం॥లు చేసిరి. జన్మసాఫల్యమునకు జన్మరాహిత్యమే తగిన విధానమని, అందుకు గురూపదేశం అవసరమని గ్రహించి మొదట శ్రీపొన్నలూరి శాంతారాం గారు, తరువాత వీరి పినతండ్రి అయిన శ్రీవిజయ శంకర్రావు గారి ద్వారా అందుకు కావలసిన పునాదులు ఏర్పాటుచేసుకొని, వారి జిజ్ఞాసను ఫలప్రదంగావించుటలో శ్రీశివరామదీక్షితీయ సాంప్రదాయము చాలా

నిర్దుష్టమైనది, రాజయోగ ధర్మంలో భుక్తి,ముక్తి,క్రియల రెంటిలో పరిపూర్ణత సాధించుట అవసరమని, అందుకు అవసరమైన అనుష్టాఆచరణవిచారణపద్ధతులు గురూపదిష్ట మార్గమునందు బోధనాపద్ధతిద్వారా తరింపవచ్చుని, శ్రీపొన్నలూరి శాంతారామ్‌గారిచేత కూడా ప్రేరేపితులై, ఈసాంప్రదాయమునకు పీఠాధ్యక్షులైన శ్రీదయానందపొన్నాలరాజయోగీంద్రులవారి ప్రియశిష్యులైన పరిపూర్ణ దర్శనాచార్య శ్రీసదానంద ఇలపకుర్తి వీరవెంకట రామచంద్రరావుగారి ప్రియశిష్యులైన శ్రీవిజ్ఞానానంద మంచిరాజు శ్రీనివాసమూర్తి-సుగుణావతిగార్ల వద్ద 1998వ సం.ర. మాఘపౌర్ణమినాడు ఉపదేశక్రమములో గురుమంత్రదీక్షగైకొని, సాంప్రదాయ పద్ధతి యందు నిర్దేశింపబడిన అనుష్ఠాన, ఆచరణ,విచారణల ద్వారా బోధ యొక్క సమగ్ర రూపమును, వస్తు నిశ్చయపద్ధతిగా గ్రహించి భుక్తిముక్తిక్రియలు రెంటియందు శాంతి,ఆనందము పెంపొందించుకొని జన్మ సాఫల్యమును పొందినామని సంతృప్తితో జీవించుచున్నారు. ఈయన మితభాషి,వినయశీలి, పట్టుదలగల వ్యక్తి, ఆధ్యాత్మిక రంగములో ఆరూఢత చెందవలెనన్న గురువు వెంట,ఇంట ఉండాలి అను సూత్రాను సారముగా చిన్నవాడిగా తక్కువ కాలములోనే గురూపదిష్టమార్గములో ఎక్కువ జీవితకాలము గురువుగారితో వెచ్చించుతూ తక్కువకాలములోనే ఎక్కువారూఢతను సాధించిరి.గురువుగారితో కలిసి వీరు అన్నిప్రాంతములు పర్యటిస్తూ సహకార సంపత్తిని అందించి ధన్యులైరి. స్థానశుశ్రూషా ప్రభావమును, అవసరమును గుర్తించి విజయవాడలోని మకాన్ని కుటుంబసభ్యులతో సహా గురువుగారు నివసిస్తున్న ఎర్రబాలెంమందిరములో పై భాగమునందు నివాసమేర్పాటు గావించుకుని ప్రతి నిత్యము గురుపీఠమునకు షోడశోపచారపూజ, గురుగీత4అధ్యాయములు పారా యణ, ఇంట,వెంట ఉండి పాటించి నేర్చుకొనినాడు.

బ్రహ్మావిద్యకు అవసరమైయున్న చదువు, ఈతనికి లేకపోయినా శ్రద్ధ,భక్తి చేతగుర్వానుగ్రహమునకుపాత్రులైపైనపేర్కొన్నవన్నియుకంఠతాచేసి,మంత్రము, తంత్రము రెండింటిలోనూ గురువుగారి స్వయం పర్యవేక్షణలో నేర్చుకొని అందు చక్కని నిపుణత సాధించియున్నాడు.

అందుకునరివడా భక్తి తత్పరత, వినయశీలత, ఈతనికి జన్మతఃసిద్ధించినవి. ఈ లక్షణములు గమనించి,శ్రీ గురువుగారు ఒక ప్రత్యేక మైన దృష్టితో బ్రహ్మావిద్యకు కావలసిన ప్రత్యేకమైన శిక్షణను ఇచ్చి,అన్ని అంశములలో, గట్టి నిపుణతను సాధింపజేయగల్గిరి.ప్రతి సం॥రం॥ప్రతిష్ఠ గావింపబడిన యంత్రములన్నిటికి పీఠ నియామానుసారము ఉపాసనకాండయందలి విధివిధానము ప్రకారము అభిషేకములు,పూజాదికములు,నిర్వహించవలసియున్నది. అందులకు గాను శ్రీనివాసమూర్తి శిష్యులతో కొంతమందికి ఈ అంశములో శిక్షణనిచ్చి యున్నారు. ఈ కార్యక్రమాలు సమర్ధవంతముగా నిర్వహించేలాగున శిక్షణనిచ్చియున్నారు. అందు ఇతనుముఖ్యుడు. చదువులేని కారణముగా మంత్ర మందు పట్టులేకపోయినా,తంత్రములందు మంచినిపుణత కల్గియున్నారు. ఇతని ఆలోచన,ఆశయము జన్మసుకృతమును గమనించి కొన్ని మంత్ర విద్య లందు, తంత్రవిద్యలందు ప్రత్యేకమైన శిక్షణ కల్గించి తీర్చదిద్దబడినాడు.

జన్మతఃయోగభ్రష్టుడు, వైరాగ్యపరుడు,ఈ రెండంశములు గురువు గారిచే ఆకర్షింపబడి, అందుకు తగిన విధముగా ఈతనిని తీర్చదిద్దిగలిగేలా చేసినవి. ఇతని తోడు లేకుండా గురువుగారు ఏపర్యటనకు వెళ్ళరు.గురువుగారుచేసే ప్రయాణములకు పార్ధునికి సారధివలె వ్యవహరిస్తూ గురువుగారి యోగక్షేమములు ఒక ఆత్మపుత్రునివలె సాకుచు గురుసేవాతర్పరుడై వినయవిధేయతలు కలిగి భక్తమండలి అందరితోనూ తలలోనాలుకలా పరిచయముకల్గించుకొని నిరాడంబరతో భక్తితోదేన్నైనా సాధించవచ్చును అన్న సూత్రానికి ఆదర్శప్రాయుడైయున్నాడు.

అతని వినయం సంపత్తికి భక్తితత్పరతకు ప్రసన్నులై గురుదేవులు"సద్గుణానంద" అను దీక్షనామముతో బోధాధికారముకూడా అనుగ్రహించి ప్రాంతాలవారీగా జరిగే పీఠవార్షికోత్సవములకు తనప్రతినిధిగా పంపిస్తూ బ్రహ్మత్వాన్ని కల్గించియున్నారు. జరిగిన సభలలో తానువిన్న అంశము చెప్పటంలోకూడా ప్రజ్ఞాపాటవాలు సంపాదించే ప్రయత్నము చేస్తున్నాడు. అనుక్షణం గురువుగారిని పర్యవేక్షిస్తూ భుక్తిక్రియకు,కుటుంబ బాధ్యతలకు దూరంకాకుండా రెండుక్రియలకు ప్రాధాన్యతనిస్తూ,గురువుగారికి అంతేవాసియై బోధయందలి మర్మధర్మములు అందరికన్నా హెచ్చుగా గ్రహించి ధృడపరుచుకున్నాడు. గురువుగారి అనారోగ్యకాలములో వారిని వెన్నంటియుండి సమస్తోపచారములతో నిరంతరము వారిని సేవిస్తూ, వారి యోగక్షేమములను బాధ్యతతో నిర్వహిస్తున్న ధన్యజీవి. కుటుంబము,పిల్లలు,చదువులు,బాధ్యతల నిర్వహణకోసము కాపురము విజయవాడ స్వగృహములోనికి మార్చియున్నారు.

గురుభక్తి,గురుసేవ,గురునిష్ఠలందు ఏమాత్రము ఏమారక రెండింటికి తగువిధముగా ప్రాధాన్యతనిచ్చిపూర్ణత్వాన్ని సాధించడానికి ఈ చిరంజీవి ప్రయత్నము చేస్తున్నాడు. ఈతని ఆశయాలకు,ఆదర్శాలకు,అనుగుణ్యముగా తనవంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తూ సహధర్మచారిణి అను పేరును సార్ధకము చేసుకున్నది ఇతని భార్యయగు చి.ల.సౌ.లక్ష్మి పిల్లలు కూడా తల్లిదండ్రులకు అనుకూలముగా వ్యవహరించువారే. శ్రీ గురుకృప వీరి యందు ప్రసరించి సమస్త సుఖశాంతులు కలుగుగాక.

ఇట్లు

**పొన్నలూరి శాంతారామ్**

## పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము - అందలి విచారణ సరళి

శివరామ దీక్షిత పీఠ ప్రతిష్ఠాపన అందలి దశలు - పీఠము అను శబ్దము పీఠ అను శబ్దమునాశ్రయించి ఉన్నది. పీఠ అనగా కదలనిది, స్థిరమైనది, ధృఢమైనది, శాశ్వతమైనది అను అర్ధములతో ఈ శబ్దము చెప్పబడుచున్నది. బ్రహ్మ విద్య గురూపదిష్ఠ మార్గము నందు మాత్రమే గురు శిష్య న్యాయముగా తెలియవలసియున్నది. "గురుర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యధా గ్రంధకోటిభి:" అనగా కోటి గ్రంధములు చదివినా లభ్యముకాని జ్ఞానము గురుముఖత: మాత్రమే ప్రాప్తించగలదని చెప్పబడుచున్నది. గురువు లేని విద్య గుడ్డివిద్య. శాస్త్రములందు భగవంతునికన్నా గురువుకే ప్రాధాన్యత ఇవ్వబడినది. మనము భగవంతునిగా పూజించే రాముడు, కృష్ణుడు, మొదలైన వారు కూడా ఈ ధర్మమును పాటించి పోషించినవారే. "గురు బ్రహ్మ గురు విష్ణు గురు దేవో మహేశ్వర గురు సాక్షాత్‌పరబ్రహ్మ తస్మై శ్రీ గుంవేనమ:" అని గురుమూర్తిని శాస్త్రము కీర్తించుచున్నది. మన సంస్కృ తి సాంప్రదాయము నందు ఈ గురుశిష్య న్యాయము ఆదర్శవంతమై ప్రముఖమైయున్నది. కావున గురువు వద్ద విద్యనభ్యసించువాడు గురువుని సేవించి, అర్చించి, పూజించి విద్యను అనుగ్రహ పూర్వకముగా పొందవలసియున్నది. భగవద్గీత యందు కూడా ఈవిషయ ప్రస్తావన చేయబడినది. మానవ ప్రయత్నము ఎంత కలిగియున్నా, ఈశ్వరానుగ్రహము లేక గురు అనుగ్రహము లేనిదే బ్రహ్మ విద్యయందు ఆరూఢత సిద్ధించదు. అందుచేతనే విద్య అనునది ఏ మార్గానికి సంబంధించినదైన గురుశిష్య న్యాయములో పరంపరాగతంగా పూర్వము నుండి నేటి వరకు మనకు ప్రాప్తించుచున్నది. సాంప్రదాయము పేర ఇట్టి విధానము రూపకల్పన గావించి మహానీయులైన వారు ఒక సుస్థిరమైన ప్రణాళికను సమాజానికి అందించియున్నారు. ఇవి గురు పీఠములు లేక గురు కూటములనే పేర ప్రచారములోనున్నవి. ఇందు వారు ప్రతిపాదించు సిద్ధాంతము, శాస్త్రము అందుకు

వలయు శిక్షణ ఆచార విచారములు ప్రచార సరళి మొదలైనవన్నియు ఆయా సాంప్రదాయములకు అనుగుణ్యముగా నిర్ణయించబడి ఉన్నవి. ఇట్టి ప్రయోగము, జగద్గురువు ఆదిశంకరాచార్యులు తాను ప్రతిపాదించిన అద్వైత సిద్ధాంతమును దేశములో సుస్థిరమొనర్చుటకు పెక్కు పీఠములు ఏర్పాటు చేసి అందుకు కావలసిన సాధన, భోదన, విచారణ మున్నగునవి నిర్ధారించియున్నారు. అందు ప్రముఖమైనవి కంచిలో కామకోటి పీఠము, శృంగేరిలో శారదా పీఠము, బదరీనాథ్‌లో నారాయణ పీఠము, ద్వారకయందు ద్వారకా పీఠము, పూరీ యందు జగన్నాథ్ పీఠము, చెప్పవచ్చును ఆనాటి నుండి నేటి వరకు ఈ పీఠములు అవిచ్ఛిన్నముగా సాంప్రదాయమును అందలి విలువలను ధర్మాన్ని పాటించి పోషింపబడుచున్నవి.

మన సాంప్రదాయమునందు గురూపాసన చాలా విశిష్టమై ఉన్నది. ఉపాసకుల (శిష్యుల) ఉపాసనా సౌలభ్యము కొరకు సృష్టి కారణమైన పరబ్రహ్మమే సగుణ రూపంలో నామరూపాత్మకమై, అందుబాటులోనికి వచ్చినది. (ఉపాసకానాంహితార్థయ బ్రహ్మణో రూపకల్పన) కనబడని దానిని కనిపించేలా చేసి అందలి ఆధ్యాత్మిక తత్వమును విలువలను సామాన్యులకు కూడా అందించుటకు మన ప్రాచీన మహర్షులు మనకందించిన విధానము. ఇందు బ్రహ్మవిద్యకు ఆది గురువైన శ్రీ దక్షిణామూర్తి సాంప్రదాయము పేర కొన్ని పీఠములు, యోగము పేర శ్రీ విద్యకు (బ్రహ్మవిద్యకు) మార్గముగా చెప్పబడుచున్న శాక్తికేయ సాంప్రదాయ సంభందమైన పీఠములు కొన్ని ప్రముఖములై సమాజంలో ప్రచారంలోనున్నవి. ఇవి కాక పెక్కు మతములు వారి సిద్ధాంతములపేర, వారి ఆరాధ్య దైవములపేర కొన్ని పీఠములు ఏర్పాటు చేసుకొని వాటి ద్వారాఆయా సిద్ధాంతములు సమాజమునకందించియున్నారు. వీటిని వేదికలుగా చేసుకొని ఆయా సాంప్రదాయమందలి ఆధ్యాత్మిక విలువలను, ప్రయోజనాన్ని, సమాజానికి అందించి

వాటిని పాటింప చేయుటయే ఇందలి ముఖ్య ఉద్దేశము. ఇక ఇట్టి పీఠములను గుర్చి విచారించుటలో యంత్రము, ప్రాణప్రతిష్ట గావింపబడి, గురుపాదుకలు గాని ఛాయా చిత్రము గాని, దాని యందు ఏర్పాటు చేసి ఉండును. ఇట్టి రూపకల్పన జరిపిన వాటిని పీఠమనే పేరుతో చెప్పవచ్చును. ఉపాసనాకాండయందలి విధివిధానముననుసరించి, బీజాక్షరములతో ఆయా మంత్రములతో యంత్రబంధముగావించి వాటిని యంత్రములయందు ప్రాణ ప్రతిష్ట గావింపజేసి, పంచలోహములతోగాని, రాగిరేకుతోగాని తయారుచేయబడిన రేకుపై, యంత్రములు లిఖింపబడియుండును. దీనినే "యంత్రము" అనే పేర పిలవబడును.

"మంత్రాధీనం దైవం" అనగా దైవము మంత్రమునకు ఆధీనమై ఉండును. నిత్యాయనుష్టానపరులై మనోవాక్కాయ కర్మలచే మంత్రసిద్ధిని సాధించిన మహనీయులచే ఆయా మంత్రాధిష్టాన దేవతలను యంత్రభూతముగా ప్రాణ ప్రతిష్టగావించి, జప హోమ పూజాధికములతో ఆవాహనముగావించి, ప్రతిష్టగావించెదరు. ఇట్టి విధివిధానమంతయూ "నిరుక్తము" అను పేరుతో శాస్త్రమునందు చెప్పబడును. గురువులతో సమానముగా ఇట్టి మంత్ర నిర్మాణములతో గూడియున్న గురుపీఠము కూడ ఎంతోశక్తివంతమై, విశేషత్వం కలిగియుండును. గురుసాంప్రదాయమునందు "గురుసాక్షాత్ పరబ్రహ్మ" అను భావముతో గురు పరమాత్మయే అధిష్టాన దేవతగా యంత్ర ప్రతిష్ట గావింపబడి, అందు మంత్రశాస్త్రము ప్రకారము భీజాక్షర సంపుటితో ప్రాణప్రతిష్టగావింపబడియుండు యంత్రమునకు నిత్య, ధూప, దీప, నైవేద్యములతో అర్చింపబడుటచే ఎంతోశక్తివంతమై ప్రకాశించుచుండును. యంత్రము మంత్రమునకు శరీరమువంటిది. గురుస్వరూపము సర్వదేవతా స్వరూపము, సర్వారిష్ట వినాశకరము, సర్వమంత్రచ్ఛేదనాకరము. అంతా తానే తానే అంతగా ఉనికి కలిగి యుండును. ఏనుగు పాదముద్ర యందు మిగితా

అన్నిప్రాణులు పాదముద్రలు ఇమడకలిగినట్లుగా, గురుపీఠము నందు సమస్త దేవతలు, శక్తులు ఆశ్రయించికొని ఉందురని గురుగీతా గ్రంథమునందుచెప్పబడుచున్నది. ఇట్టి పీఠములను, గురువును నిత్యము పూజించువారికి సర్వదేవతలను, శక్తులను ఆరాధించినట్లేకాగలదు.

**శ్లో ॥ సయేవ సద్గురు సాక్షాత్ సదసద్ బ్రహ్మ విత్తమ:**
**తస్యస్థానాన్ని సర్వాణి పవిత్రాణి న సంశయ: ॥**

**శ్లో ॥ సర్వ శుద్ధపవిత్రో సౌ॥ స్వభావాద్యత్ర తిష్టతి**
**తత్రదేవ గణా సర్వే క్షేత్ర పీఠే చరంతి చ ॥**

అని గురు స్థానమును, గురుపీఠముయొక్క విశిష్టతను, పై శ్లోకముల యందు పేర్కొనబడుచున్నది. జన్మరాహిత్య విధానమునకై సరియైన ఋజు మార్గముగా పేర్కొనబడుచున్న దీక్షితీయ సాంప్రదాయమునందుగురూపాసన, అత్యంత ప్రాధాన్యత కలిగియున్నది. గురుప్రభోదచేతనే సర్వభ్రాంతిరాహిత్య స్థితిని ఆరూడపరుచుకొనగలుగు భోదనావిధానము,"గురు వక్త్రే స్థితంబ్రహ్మ ప్రాప్యతే తత్ప్రసాదత:" అన్నట్లుగా గురు అను గ్రహము ద్వారా మాత్రమే తెలియవలసియున్నది. ఇట్టి ప్రభోదయందు పరిపూర్ణమును ఎరిగి, ఎరుకను ఎరిగి, ఎరుకను మాను, అనుసూత్రమునందు గురుకృప అత్యంత అవసరమైయున్నది. ఇచ్చట గురువును వ్యక్తి నిష్ఠము కాకుండా, తత్వనిష్ఠతో భావించవలెను. " గురుకృపా ప్రసాదసిధ్యర్థే" అను సూత్రము పైనే ఉపదేశ దీక్ష గావించబడుచున్నది. ఈశ్వరానుగ్రహ ప్రాప్తినే ఈ పరిభాషలో "గురుకృప" అనే శబ్దముచే చెప్పవచ్చును. గురుభక్తి, గురుసేవ, గురునిష్ట ఈ సాంప్రదాయమునకు ప్రాణము వంటివి. బ్రహ్మావిద్యాప్రాప్తికి ఎట్టి మార్గమును పాటించవలెను? అను ప్రశ్నకు నిరాలంబోపనిషత్తునందు ఈ విధానముగా పేర్కొనబడినది. సమస్త

శరీరములందు చిన్మయ రూపమై ఏ పరబ్రహ్మ తత్వము ప్రకాసించుచున్నదో అట్టి దానిని వస్తునిశ్చయపూర్వకముగా అనుభూతముగావించగలుగు గురువునే ఉపాసించవలసినదిగా పేర్కొనబడుచున్నది. గురూపాసన సర్వదేవతోపాసన దీని విధివిధానము తనకు మంత్రోపద్రష్టఅయిన గురువు ద్వారా సాంప్రదాయమందలి విలువలతో క్రమపద్ధతి యందు విచారించిన వారికి ఈ వివరణ స్పష్టముకాగలదు. ఈ విధానము పాటించుట చేత గురుకృప సిద్ధించి తన వాస్తవ రూపము (స్వస్వరూపమైన అఖండ ఎరుక) ఎరగబడుట, దానికన్యమై వేరైయున్న పరిపూర్ణము యొక్క ఉనికి ధృడపడుట, దానియందు గురైరగబడే తనకు, మూలము గాని స్థానము గాని లేదని ధృడపడుట, అను క్రమమునకు ఈ గురుకృప ఆధారమైయున్నది. ఉపాసించుటకు వీలై యున్నది గురు స్వరూపము ఒకటే. పరపూర్ణ పరబ్రహ్మమునందు ఉపాసన, ఉపాస్యము, ఉపాసకుడు అను త్రిపుటి లేనిది, ఉపాస్యమునందు ఉపాసనకు సాధ్యముకానిదే పరిపూర్ణముగా తెలుసుకోమని కేనోపనిషత్తునందు చెప్పబడుచున్నది.

గురుస్వరూపము అనగా ఎటువంటిది? అని విచారించినచో, గొప్ప స్వరూపమని శబ్దార్థము. "అణోరణీయన్ మహతో మహీయాన్" అని వర్ణింపబడుచున్నది. అణువు కంటెను చిన్నదై, మహత్తుకంటేనూ పెద్దదై ఉన్నదన్నమాట. ఇట్టి గురు స్వరూపము (బ్రహ్మ పదార్థము) విద్ అనగా తెలుసుకొని, అట్టి భావమును మనసులో నింపుకొని వేరు కాకుండా జీవించు వారిని కూడా, అట్టి గురు శబ్దము చేత సూచించవచ్చును. తనకు మంత్రోపదేశము చేసిన వ్యక్తి ఇట్టి పరబ్రహ్మమే కానీ వేరు కాదు, అను దృష్టితో శిష్యుడు భావించుట, సేవించుట, నమస్కరించుట అనునవి ముఖ్యమైనవిగా తెలియవలెను. ఇచట భావము చాలా పరిశుద్ధమైయుండవలెను. ఏలననగా "యద్భావంతద్భవతిగా" చెప్పబడుచున్నది.

కర్మేంద్రియములలో ప్రధానమైనది. శరీరమును ఒకస్థానము నుండి మరొక స్థానమునకు చేరుటకు వీలుకలద్రై, అనుకున్న గమ్యాన్ని చేర్చగలిగేది. ఇట్టి పాదుకాపూజ ప్రాముఖ్యత మొట్టమొదటిగా రామాయణము నందు భరతునిచే "శ్రీ రామపాదుకా పట్టాభిషేకం" సంధర్భంలో చెప్పబడినది.

ఈ పాదములు గమనంతో పాటుగా పునరాగమనం (తిరిగి వచ్చు విధానం ) కూడా వీటికున్నదన్నమాట. ఈ దృష్టిలో గురు పాదములాశ్రయించటములో గొప్పతనమేమిటి? వీటి మహిమ ప్రయోజనం ఏమిటి? అని విచారించినచో తన్నాశ్రయించిన వారిని చేరవలసిన గమ్యమునకు చేర్చుటకు సహాయభూతములుగా నున్నవని తెలియవలసి ఉన్నది. తిరిగి ఇక వెనుకకు తీసుకురావటము అనే క్రియ ఉండదన్నమాట.

"పూజా మూలం గురు: పదమ్" అన్నట్లుగా గురు పాదములాశ్రయించి పూజించిన వారికి గురుకృప కలిగి "ముక్తి" సిద్ధిస్తుందేగాని పునర్జన్మ హేతువుకా జాలదు. అందుచేతనే "ముక్తి మూలం గురుకృపగా" చెప్పబడుచున్నది. గురు పాదాశ్రయములేని సాధకులు తల్లి లేని బిడ్డ వంటివాడు. శరీరమందు ఈ పాదములు భూమినాశ్రయించుకొని ఉండి పూజనీయమై ఉన్నవి. కావున గురు భక్తుడు గురు పాదములకు మాత్రమే సేవ, పూజ, నమస్కారము మొదలగునవి చెయ్యవలసి ఉన్నవి. ఇట్టి విధానముచేత గురువనుగ్రహము పొంది మోక్షప్రాప్తికి వీలు కలుగును.

శ్లో ॥ పాదాబ్జే సర్వ సంసారదావకాలానలంస్వకే
బ్రహ్మరంధ్రే స్థితాంభోజ మధ్యస్థం చంద్రమండలం ॥

అనగా ఎవ్వని పాద కమలముల యందు సర్వసంసారములు దహించగలుగు దావాగ్ని కలిగిఉన్నదో, బ్రహ్మ రంధ్రమందున సహస్రార పద్మమందుగల చంద్రమండలమందు ఎవ్వరు ఉనికికలిగివున్నారో, అట్టి గురుమూర్తిని స్మరించవలెను, అని గురుగీతయందు చెప్పబడుచున్నది. ఇక్కడ పాదమనగా పొందబడేది, పొందబడునది కూడా పాద శబ్దము చేత సూచింపబడుచున్నది. ఈ దృష్టితో తాను పొందవలసిన గమ్యస్థానము అది పొందుటకు సాధనభూతమును కూడా ఈ పాదములే అని చెప్పవలయును. కనుక తాను పొందతగిన గురు పదమునకు, తానాశ్రయించునది కూడా గురుపాదమేనని తెలియవలెను. సృష్టినిర్మాణమునందు కార్యాకారణరూపముగా నున్న బ్రహ్మమును నాలుగు పాదములుగా విభజించి ఒక పాదముచే విశ్వరూపము ఆక్రమించివున్నదని, ఇంకను మిగిలిన మూడు పాదములు దివ్యము అమృతమయివున్నదని అలంకారముగా చెప్పబడుచున్నవి. ఈ విధముగా బ్రహ్మమునకు అవిద్యాపాదము, విద్యాపాదము, ఆనంద పాదము, తురీయ పాదము, అను నాలుగు పాదములు నిర్ణయింపబడినవి. వ్యక్తిగతంగా "గురువును" భావించినప్పుడు భూమిపైనడయాడు పాదములజంట రెండుగా చెప్పవచ్చును. నిర్గుణ రూపమైనప్పుడు నాలుగుగా చెప్పవచ్చును. "గురు సాక్షాత్ పరబ్రహ్మ" అను భావనలో గురూపాసన గావించు వారికి గురుగీత యందు రెండు పాదములుగా పేర్కొనబడినవి.

శ్లో ॥ వందే గురుపద ద్వంద్వం వాఙ్మనోతీత గోచరం
శ్వేతరక్తప్రభాభిన్నం శివశక్త్యాత్మకం పరం ॥

అనగా గురు పాదములు శివశక్తిస్వరూపములు (పురుష ప్రకృతులు) శ్వేతరక్తవర్ణములు కలిగిఉన్నవి. ఇవియే దక్షిణ, వామపాదములుగా చెప్పబడుచున్నవి. ఈ రెండును కలిసి ఏకైక రూపమైన బ్రహ్మపదము, అదియే గురుమూర్తి శ్రీ పాదము.

ఈ భావనతో గురువుకు నమస్కార పూజాదులు చేయ్యవలయును. నిర్గుణ రూపమైన గురుస్వరూపము యొక్కపాదములు వస్తునిశ్చయరూపముగా గురు ముఖత మాత్రామే గుర్తింపనగును. ఈ పాదములనే బీజాక్షర బద్ధము చేసి మంత్రనిర్మాణం, యంత్రనిర్మాణం గావింపబడినవి. ఇట్టి దృష్టితో గురు స్వరూపమును భజామి, స్మరామి, నమామి, వదామి అని కృషి సల్పిన వారికి గురుకృపా ప్రసాదసిద్ధి (ఈశ్వరానుగ్రహప్రాప్తి) తద్వారా మోక్షప్రాప్తిసిద్ధించును. ఈ దృష్టితో పీఠమును, యంత్రమును, మంత్రమును, ఉపాసనావిధానమును విచారించవలసి యున్నది.

## శ్రీ శివరామ దీక్షిత అచల గురుపీఠ ప్రతిష్టాపన

ఈ సాంప్రదాయమునకు గురుపాసన ప్రాణము వంటిదని తెలుసుకొంటిమి. ఇంత వరకు ఈసాంప్రదాయమునకు పీఠ నిర్ణయము అనునది ఏర్పడలేదు. ఏలనగా ఈ ధర్మము గృహస్థ ధర్మములో ఉన్నవారికి మాత్రమే అనుసరణీయమై ఉన్నందున ఆనాటి గురువులు తమ ఇంటినే గురుకులముగా మార్చి ప్రభోధనము గావించుచుండెడివారు. ఏక గురు శిష్య న్యాయము ప్రచారములో నుండెడిది. పూర్వ పుణ్యఫలప్రదముచే జన్మకర్మలనివృత్తి కొరకు గురువులనన్వేషించుట, అరుదైన వారి దర్శనభాగ్యముకలుగుట, యోగ్యతా, పాత్రతలను గమనించి వారికి యోగ్యమైన రీతిలో సాంప్రదాయ మందలి విలువలు బోధనా క్రమముచే దృఢపరచి సంశయనివృత్తి గావించి, ఏతత్ ధర్మమును లోకకళ్యాణము కొరకై "దీపో దీపాంతరం యథా" అను రీతిగా గురుశిష్య న్యాయములో రహస్యవృత్తిగా మాత్రమే ప్రచార విధానము సాగుచుండెడిది. కాలగమనములో సాంప్రదాయము యొక్క అవసరము, ప్రయోజనము దృష్టిలో ఉంచుకొని జనబాహుళ్యము కొరకు విరివిగా సమాజంలో ఈ ధర్మమును ప్రచారము చేయవలసిన అవసరము. ప్రయోజనాన్ని గమనించి

సంతకూటములు ఏర్పడినవి. ఇవి రానురాను పరిణతి చెంది ఆశ్రమములుగా రూపాంతరము చెందినవి "ఏకం సత్ విప్రాబహుధావదంతి" అను సూత్రానుసారంగ ఒకే సత్యమును సమాజంలో విస్తరింపజేయుటలో పెక్కు మంది గురు శిష్య పరంపరలు బాహుముఖముగా విస్తరించినవి. ఏక సాంప్రదాయం భిన్న మార్గములు ఏర్పడినవి. ఎవరి మార్గములు వారు వ్యక్తినిష్టమునకు ప్రాధాన్యతనిస్తూ ఆధ్యాత్మిక తత్వమును ప్రచారము చేయసాగిరి. దీని వలన ఏకత్వంలో భిన్నత్వం కలిగినది. ఎవరికి వారే యమునా తీరే అన్నట్లుగా ప్రచారం జరగడంలో సాంప్రదాయమందు మౌళికాంశములు, వాటి వివరణ చెప్పడంలో భిన్న దృక్పధములు కలిగియున్నవి. వీటినన్నింటిని సంస్కరించి సాంప్రదాయకవిలువలను ప్రమాణములను ఆదర్శములను స్పష్టపరచి, జాగ్రత్తవహించుట చట్టబద్ధము చేయుట సమాజమును జాగృతమొనర్చుట విజ్ఞులకు కర్తవ్యముగా ఏర్పడినది. ఇట్టి సంఘటలన్నియు దీక్షితీయ సాంప్రదాయము నందుకూడాచోటుచేసుకొన్నవి. శ్రీ ఫీల్ఖానా లక్ష్మణ ప్రభువులు శివరామ దీక్షితీయ అచలగురు పీఠమునకు పీఠాధిపతులై వ్యవహరించినట్లుగా గతంలో విచారించి యుంటిమి. వారి శిష్యులలో శ్రీ వేంకటేశ్వరఅవధూతగారు ప్రముఖులు. వీరి యోగ్యతను గమనించి శ్రీ లక్ష్మణ ప్రభువులు, "సచ్చిదానంద వేంకటేశ్వర అవధూత" అను మకుటంతో 1892 సం॥ చైత్ర పౌర్ణమినాడు బోధాధికారము అనుగ్రహించిరి. తరువాత 2సంవత్సరములు విరామము జరిగిన మీదట 1894 సం॥ లో శ్రావణ పౌర్ణమి నాడు శివరామ దీక్షితీయ అచల గురు పీఠమునకు పీఠాదిపత్యమును వీరికి అనుగ్రహించిరి. వీరు అవధూతయై యెధేచ్ఛగా తిరుగుచుండుటచేత వీరి శిష్యులతో ప్రముఖులైన శ్రీ భూమానంద మందిప్పల హనుమంత రాజయోగి గారిని పీఠాధిపతిగా నియమించిరి. 1933 సం॥ లో శ్రీ హనుమంతరాజయోగిగారు తమ గురువర్యులయిన శ్రీ అవధూతస్వామివారి ఆదేశానుసారం శ్రీ హనుమంత

రాజయోగీంద్రులవారి శిష్యులతో ప్రముఖులు బోధాధికారియైన శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రులు వారి ఇంటను శ్రీ శివరామ దీక్షిత అచల గురు పీఠమును స్థాపించి, గురుయంత్రప్రతిష్ట గావించిరి. నాటి నుండి పీఠ సాంప్రదాయమునకు అనుగుణ్యముగా పీఠమునకు ప్రతి నిత్యము ధూప దీప నైవేద్యకములు, భజనకాలక్షేపములు, వేదాంత విచారణ శ్రీ రాజయోగీంద్రుల వారి ఆధ్వర్యమున జరుగుచుండెడిది. ఈ విధముగా "శివరామ దీక్షితీయ అచల గురు పీఠము" అనునది ఈ సాంప్రదాయమునకు ఏర్పడెను. 1934 సం॥లో శ్రీ హనుమంత రాజయోగీంద్రులు బ్రహ్మైంక్యము చెందిరి. వీరి నిర్యాణములో పీఠ ధర్మము యధావిధిగాజరిపించుటకును, పీఠగ్రంధములు ముద్రించుట మొదలైన కార్యనిర్వాహణకు స్థానికముగా పీఠాధికారి లేకపోయేను. శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర అవధూత స్వామి నిత్యసంచారములో ఉంటూ కార్యనిర్వాహణ జరిపింపజాలకపోవుటచే 17-5-1935వ సం॥ శ్రీ అవధూత స్వామి, శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారిని శ్రీమద్రామడుగు శివరామ దీక్షిత అచల గురు పీఠమునకు పీఠాధికారిగా నియమించి, అందుకుకావలిసిన పీఠాధికార శాసనము రాగి రేకుపై వ్రాయించియిచ్చిరి. అంతేకాక సాంప్రదాయక ముద్రిత, అముద్రిత గ్రంధములు శ్రీదయానందులకు అప్పగించి వాని ముద్రణపునర్ముద్రణాదికములు జరిపిస్తూ సాంప్రదాయమును ప్రచారములోనికి తెమ్మని ఆదేశించిరి.

నాటినుండి శ్రీ దయానంద పొన్నాలరాజయోగీంద్రులవారు శ్రీమత్ రామడుగు శివరామదీక్షిత అచల గురుపీఠమునకు అధ్యక్షులై పీఠమును సాంప్రదాయమును సమాజములో విరివిరిగా ప్రచారము గావించియున్నారు. శ్రీ అవధూతస్వాముల వారు బ్రహ్మైంక్యము చెందు వరకు శ్రీ దయానంద రాజయోగీంద్రులు తమకు

అప్పగించిన పీఠాధికారమును వినియోగించక, శ్రీ అవధూత స్వాములవారి ప్రతినిదిగా మాత్రమే పీఠాధికారమును పరిపాలిస్తూ కార్యదర్శి హోదాలో గ్రంధ ముద్రణాదులు జరిపించిరి.

శ్రీ శివరామదీక్షితీ సాంప్రదాయములో శ్రీ భూమానంద మందిప్పల రాజయోగి గారి శిష్యపరంపర పశ్చిమ గోదావరి జిల్లాలలో ఉనికికలిగియున్నది. శ్రీ బండి రామస్వామి వారు వీరి శిష్య పరంపర శ్రీ భైర్రరాజు సత్తిరాజు గారు, శ్రీ పాలూరి జగన్నాధరావుగారు, శ్రీ యిలపకుర్తి వీరవెంకటరామచంద్రరావు గారు 1941 సం॥ నుండి 1947 సం॥ వరకు శ్రీరాజయోగీంద్రులవారు, వారు నిర్వహించే సభలలో వారి బోధనాక్రమమునందు పెక్కు రహస్యములు వస్తునిశ్చయపూర్వకముగా యిమిడియున్నవని శ్రీ రామచంద్రరావుగారి దంపతులు గ్రహించి, వారి పాదములాశ్రయించి నిజ సాంప్రదాయములలో ప్రవేశించిరి. ఈ క్రమంలో శ్రీ దయానందరాజయోగి గారు శ్రీ భైర్రరాజు సత్తిరాజుగారు, శ్రీ పాలూరి జగన్నాధరావుగారు, శ్రీ రామచంద్రరావు, గారు వీటిని గూర్చి సమగ్ర వివరణ "రాజయోగి విజయము" అను గ్రంధమునందు కాననగును.

1951 సం॥లో నర్సాపుర పట్టణములో శ్రీ రామచంద్రరావు గారు సీతామహాలక్ష్మి గారి స్వగృహమునందు వేదాంత సరస్వతి, అభినవ దీక్షిత, శ్రీ కడివేటి నర్సారెడ్డి గారి ఆధ్వర్యంలో పీఠాధిపతులు గురుయంత్ర పీఠ స్థాపనతోగూడిన ఉప పీఠమును ఏర్పరిచియున్నారు. అప్పటి నుండి ఈ పీఠ ధర్మము నేటికిని అవిచ్ఛిన్నముగా కొనసాగుచున్నది. 1981 సం॥ వైశాఖమాసంలో మంచిరాజు శ్రీనివాసమూర్తి సుగుణావతిగార్ల వసతి గృహములో శ్రీ రామచంద్రరావు గారి, స్వీయ పర్యవేక్షణలో యంత్ర ప్రతిష్ఠతో కూడి గురుపీఠ ప్రతిష్ఠాపన జరిపిరి. అంతేకాకుండా

ఉపాసనాకాండన విధానముననుసరించి ఈ పీఠధర్మమును అనుష్ఠాన, ఆచరణ, విచారణ ద్వారా గురుగీతా ధర్మమును ఎలా నిర్వహించాలో, ప్రచారము చేయాలో అందలి విధివిధానమును నిర్దుష్ఠముగా సోదాహరణముగా ఈ దంపతులకువివరించిరి. ఈ విధానమును అవిచ్ఛిన్నముగాకొనసాగుచున్నది. 1977 సం॥ లో శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తి గారి దంపతులకు "విజ్ఞానానంద" అను దీక్షానామమును, బోధాధికారము ఇచ్చి తదనంతరము ఈ సాంప్రదాయమును వారి ప్రణాళికకు అనుబంధముగా ఎలా అందించాలో నిర్దేశించి పీఠ బాధ్యతను వారికి అప్పగించిరి. 1985 సం॥ అక్టోబర్‌లో పీఠాధిపతులు శ్రీ దయానందుల రాజయోగీంద్రులు బ్రహ్మైక్యము చెందిరి. ఈ సంఘటన శ్రీ రామచంద్రరావు గారిని తీవ్రముగా కలచివేసినది. దీనికి కారణము ఏమిటంటే శ్రీ శివరామ దీక్షితి సాంప్రదాయము ఎన్నో విలువలతో కూడియున్నదని, శాస్త్రీయమై సనాతనమైన ఈ ధర్మము కలానుగుణ్యముగా పెక్కు మార్పులు చెందుచు, బాహుముఖమై సమాజములో ప్రచారమునకు వచ్చినదని, కానీ విలువలు ఆదర్శాలు రూపాంతరము చెందియున్నాయని, ఏక సాంప్రదాయము భిన్న మార్గములుగా మారినపుడు, యుగపరుషుడై, అవతార పురుషులై శ్రీ దయానందులు ప్రభవించి దురాచారులను రూపుమాపి, సాంప్రదాయమునకు పీఠమునకు ఆదర్శవంతమైన విలువలతో ప్రయోజనాలతో కూడిన పెక్కు సంస్కరణలను చట్టబద్ధము గావించి తన వాదనా పటిమి, మేథాశక్తి, బోధనా ధారుద్యముతో అజేయులై నిలచిరి. ఈ అంశములన్నీ శ్రీ రామచంద్రరావు గారు తీవ్రముగా ఆలోచించి భవిష్యత్తులోవాటికి ఏర్పడవలసిన రూపకల్పన ఆశయాలు, అనుభవాలు, ఆలోచనగామలచి శ్రీనివాసమూర్తికి వివరించబడినది. అందు ప్రముఖమైనది గురుపీఠము యంత్రమును ఉపాసనాకాండ, సిద్ధాంత పద్ధతి, ఉపదేశ పద్ధతి, సాధనాక్రమము బోధనా క్రమము ఒక ట్రైనింగ్

సెంటర్‌గా ఏర్పాటు చేసి ఆదర్శవంతమైన జీవితాన్ని కృషిని సమాజానికి అందించాలని వారి తీవ్ర వాంఛ.

శ్రీ రామచంద్రరావుగారి శిష్యులలో విశాఖజిల్లా పాయకరావుపేట వాస్తవ్యులు శ్రీ దాసరి నేస్తాలు గారి దంపతులు ముఖ్యులు. వీరు అత్యంత గురుసేవా తత్పరులు. 1982 సం॥లో వీరి స్వగృహంలో గురుపీఠ యంత్ర ప్రతిష్టాపన శ్రీ గురుదేవులచేగావింపబడినది. తూర్పుగోదావరిజిల్లా కిర్లంపూడి మండలం **S**.తిమ్మాపురం గ్రామంలో శ్రీ బోనగరి సత్యవతమ్మ గారి స్వగృహములో వారి కుమారుడు శ్రీ బోనగిరి ఉదయ భాస్కర రావు గారి దంపతులు చేత గురువుగారి ఆధ్వర్యములో గురుపీఠయంత్ర ప్రతిష్ఠ గావింపబడినది.

1973 సం॥లో శ్రీ సీతామహాలక్ష్మి గారు బ్రహ్మండైక్యము చెందినారు. 1986 సం॥ శ్రీ రామచంద్రరావు గారు బ్రహ్మండైక్యము చెందినారు. దీక్షితీ సంప్రదాయము నందు గురుపరంపర చరిత్రలో ఈదంపతులు ధ్రువతారాలుగా నిలిచినారు. వీరు భౌతికంగా లేకపోవుట వలనవారి శిష్యప్రశిష్యులకు తీరని లోటైనను, వారి సులక్షణ లక్షితమైన మార్గ దర్శకత్వము అనుష్టాన, ఆచరణ, విచారణ, విధానము వారి శిష్యులకు వారసత్వముగా సంక్రమించియున్నది.

వ్యక్తిగతమైన కృషికి వస్తే శ్రీ రామచంద్రరావు గారి దంపతులు ఒక విలక్షణమైన రీతిలో ప్రత్యేకతను సంతరించుకొనుచు శ్రీ దయానందులవారి అనుగ్రహమునకు పాత్రులై దీక్షిత సిద్ధాంతమునందు ఓ నిర్దుష్టమైన అవగాహన, ఆలోచన, ఆరూఢత, కలిగించుకొనిరి. అందు 1) గురూపాసన, 2) పాఠ్యాంశముల వివరణ 3) ఎరుక పరిపూర్ణముల వస్తునిశ్చయజ్ఞానము. ఈ అంశములపై సమాజములో ఈ సాంప్రదాయములో కృషి చేసేవారు, భిన్న భిన్న అభిప్రాయములు

కలిగియుండుట తద్వారా సాంప్రదాయ పద్ధతిగా కృషియందు ఆరూఢత లేకపోవుట గమనించి, వారి శిష్య మండలిలో ఈ అంశములకు ఎట్టి సందేహము లేకుండా నిర్దుష్టముగా ధృఢపరచుకొను విధానము ఉపదేశించియున్నారు. ఇందు గురు గీతా ధర్మము, 1) అనుష్ఠానము, 2) ఆచరణ, 3) విచారణ. ఇందు మళ్ళీ బుద్ధి నిశ్చయము ఆత్మ నిశ్చయము పరిపూర్ణబోధ సద్యోముక్తిని ప్రతిపాదించును కదా! గురుశిష్యులిరువురు బోధనా క్రమము చేత మాత్రమే ఒకరినొకరు ప్రభావితులు కావించుకొనవలసియున్నది. అందులకై వారు కొంత కాలమైనా ఒకే స్థానమందు నివసించుట అవసరమైయున్నది. పూర్వకాలములో గురుకులములోనే, గురుస్థానమందు గురుశిష్యులిద్దరు కలసి జీవిస్తూ విద్యయందు ఆరూఢత చెందిన మీదట శిష్యుడు గురుస్థానమును విడచి ధర్మ పోషణకై తన స్థానమునకు చేరుట ఒక ఆచారముగా, సాంప్రదాయముగా చెప్పబడుచుండెడిది. నేటి కాలములో ఇట్టి గురుకులాలు గాని శిక్షణాలయములు (ట్రైనింగ్ సెంటర్స్) గాని వుండుటకు సాధ్యము కావడం లేదు. ఏలననగా ఇది రాజయోగ ధర్మము. జ్ఞానాన్ని పొందవలసిన వయసులో చేయువలసినపనులుచేసి పొందుటకు వీలుగాకున్నది. గృహస్థ ధర్మాన్ని నిర్వహించడంలో గురుశిష్యుల బోధనాక్రమము ఆశించినంతమేర ఫలప్రదము కాకున్నది. ఒకచోట కొన్ని ఆశ్రమాలు నిర్వహించబడినా అవి వార్షికోత్సవాలకే పరిమితమైపోతున్నాయి. ధర్మాచారణయందు శ్రవణ , మనన, నిధి, ధ్యాసలు (భుక్తి క్రియతో పాటు ముక్తి క్రియ) పాటించుటలో అప్రయత్నముగా కొన్ని అవరోధాలు ఏర్పడుచున్నాయి. ఈ సమస్యలకు పరిష్కారమార్గముగా గురుశిష్యులిద్దరు కొంతకాలమైన లక్ష్యసాధన కొరకై ఒకే స్థానమునందు జీవించవలసియున్నదని అందుకు వీలుగా శిక్షణాలయాలు (ట్రైనింగ్ సెంటర్స్) అవసరమని, అందు రోజువారీ జీవితానికి సరిపడా కనీసవసరాలు, (వసతి సౌకర్యం, స్నానాధికములు,

భోజనాధికములు), అనుష్ఠానాధికములు, బోధనాధికములు, గావించుకొనుటకు, ప్రత్యేకమైన ఏర్పాట్లు కలిగి ఉండాలని, ఇట్టి అధ్యయునమునందు ప్రాపంచిక సంబంధమైన శబ్దాది, విషయ, స్పర్శ ఆ ప్రాంతమునందుండకూడదని, శ్రవణ, మనన నిధి ధ్యాసలు కేంద్రములుగా నిలవాలని అందుకు వీలుగా ఈ మందిరాలు ఏర్పాటు చేయాలని శ్రీ గురుదేవుల మహత్తర ఆలోచన, ప్రణాళికా అయి వున్నాయి. శ్రీ గురుదేవుల ఆశయు, లక్ష్యము నెరవేర్చటంపట్ల ఇవి రూపకల్పన గావించుట ఎట్లు? అన్నదే వారి శిష్య మండలి ముందున్న ప్రశ్న. వారి జీవితకాలములో వారి ఆశయాలు కార్యరూపము దాల్చకుండా అలాగే వుండిపోయాయి. 1988 సం॥ పాయకరావు పేటలో నిర్వహించిన జ్ఞానయజ్ఞ ప్రభావము వారి శిష్యప్రశిష్యులపై తీవ్రముగా ప్రభావితమైనది. శ్రీ గురుదేవుల ఆదర్శ స్ఫూర్తితో అనుగ్రహ ఆశీర్వచనములతో వాటిని కార్యరూపము దాల్చుటకు వలయు సమయముకోసము వీరు నిరీక్షించసాగిరి.

శ్రీ రామచంద్రరావుగారి నిర్యాణాంతరం 1992 సం॥లో గుంటూరు జిల్లా మంగళగిరి మండలం, యర్రబాలెం గ్రామములో శ్రీ శ్రీ శ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిర సంస్థ పేరుతో 12 మందిసభ్యులతో శ్రీ మంచిరాజు శ్రీనివాస మూర్తి గారి అధ్యక్షతన సొసైటీ యాక్ట్ ప్రకారం రిజిస్ట్రేషన్ గావింపబడినది. 1992 సం॥లో దాసరి బులివెంకట్రూరాజు గారి దంపతుల ఆధ్వర్యంలో సర్వాంగ సుందరంగా అన్ని వసతులతో అందు నూతన మందిర నిర్మాణము గావింపబడి అంతకు పూర్వము మంచిరాజు శ్రీనివాస మూర్తి గారి వసతి గృహంలో ప్రతిష్ఠ గావింపబడిన గురు పీఠము నూతన మందిరమునకు చేర్చబడినది. ఆనాటి నుండి నేటి వరకు ఆ మందిరమునందు అవిచ్ఛిన్నముగా నిత్య ధూపదీప నైవేద్యాలతో గురుపూజ,

అనుష్ఠానము, గురుగీత పారాయణ జ్ఞానయజ్ఞములు విరివిగా భక్తాదుల ఆర్థిక సహాయముతో నిర్వహింపబడుచున్నది.

పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం పట్టణంలో 2000 సం ॥ లో నూతన మందిర నిర్మాణము శ్రీ సమతం వీర సుబ్బారావు దంపతులపేర వారి కుమారులు శ్రీ సోమలింగం, శ్రీ నాగలింగం గార్లు కేటాయించిన స్థలంలో అన్ని వసతులతో నూతన మందిర నిర్మాణము గావింపబడి అంతవరకు 1951 సం ॥ నుండి శ్రీ రామచంద్ర రావు గారి స్వగృహములో పూజలందుకుంటున్న గురుపీఠమును నూతన మందిరమునకు చేర్చబడినది.

నిజామాబాద్ పట్టణములో శ్రీ ఆరుగొండ విశ్వనాథం గారు, శ్రీ గజం నర్సయ్య గార్ల ఆధ్వర్యములో నూతన మందిర నిర్మాణము గావింపబడి 2002 సం॥లో గురుపీఠ యంత్ర ప్రతిష్ఠాపన గావింపబడినది. నల్గొండ జిల్లా గరిడేపల్లి గ్రామంలో శ్రీ తిరుమలగిరి శ్రీనివాసు శ్రీ ప్రధాని వీరయ్య దంపతుల ఆధ్వర్యంలో 2005 సం॥లో నూతన మందిర నిర్మాణము గురుపీఠ యంత్ర ప్రతిష్ఠాపన గావింపబడినది.

ప్రకాశం జిల్లా మార్కాపురం మండలం, నికరంపల్లి గ్రామంలో 2005 సం॥లో శ్రీ బండి రామిరెడ్డి దంపతుల ఆధ్వర్యములో నూతన మందిర నిర్మాణము, గురుపీఠ యంత్ర ప్రతిష్ఠాపన గావింపబడినది.

మెదక్ జిల్లా శాలిపేట గ్రామంలో శాంతానంద శ్రీ బెజగామ్ నర్సీహరావు గారి దంపతుల శిష్యులు శ్రీ తాటికొండ చిరంజీవి దంపతులు, శ్రీబాలవీరయ్య

దంపతుల ఆధ్వర్యములో శ్రీ ఆరుగొండ విశ్వనాధం గారి ఆధ్వర్యములో 2011 సం॥లో నూతన మందిర నిర్మాణము, గురుపీఠయంత్ర ప్రతిష్ఠాపన గావింపబడినది.

కృష్ణా జిల్లా నీలిపూడి గ్రామం శ్రీ పుప్పాల నాగేశ్వరమ్మ దంపతులు, శ్రీ పాశం వెంకట్రావు దంపతులు, శ్రీ పుప్పాల రంగారావు దంపతుల ఆధ్వర్యంలో 2015 సం॥లో నూతన మందిర నిర్మాణము, గురుపీఠ యంత్ర ప్రతిష్ఠాపన గావింపబడినది.

1990 సం॥ నుండి 2012 సం॥ వరకు సుమారు ఈ 21 సం౹ల కాలంలో బీజప్రాయముగానున్న శ్రీ రామచంద్రరావు గారి ఆలోచన వృక్షాకృతి వహించి శాఖోపశాఖలుగా విస్తరించి ఫలభరితమై జనబాహుళ్య హృదయాలలో సుస్థిర స్థానము సంపాదించుకున్నది. "ఏ సాధన లేని బోధ" అనే భావము నుండి మార్పు చెంది సిద్ధాంతముపట్ల జిజ్ఞాస లోకంలో గల అన్ని దురభిప్రాయలు పోగొట్టి, పరిపూర్ణ దృక్పదంతో పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము, శివరామ దీక్షితీయ సిద్ధాంతమనేభావన కలిగేలా ఆదర్శవంతమై ఆచరణాత్మకమై వున్నదని సర్వులను గుర్తించేలా చేయగలుగుతోంది. ఆసక్తిగల జనులు ప్రోత్సహించి ముందుకు సాగడానికి ప్రోత్సహిస్తున్నారు. ఈ విధంగా శ్రీ రామచంద్రరావు గారి ఆశయాలు సాకారము చిరకాలము నిలిచిపోయేలా ఎదగగలిగినవి. ఈ మందిరములందు ప్రతినిత్యము అనుష్ఠానము, గురు పీఠమునకు షోడశోపచార పూజ, గురు గీతా పారాయణము, విచారణ, సాయంత్రము లఘుపూజ, మంత్ర జపము, విచారణ ప్రతి పౌర్ణమికి గురుపీఠ పూజ, వార్షికోత్సవములందు జ్ఞానయజ్ఞము, సభలు, సమావేశములు నియమబద్ధంగా భక్తాదుల ఆర్ధిక సహాయ సంపత్తితో భాద్యతాయుతంగా నేటి వరకు నిరాటంకముగా నిర్వహింపబడుచున్నది.

ఇంతేకాక యర్రబాలెం, నర్సాపురం, నిజామాబాద్, సాలిపేట, గరిడేపల్లి, కె.సముద్రం, నికరంపల్లి మందిరాలను అనుష్ఠానాధికముకే పరిమితం కాకుండా శిక్షణా కేంద్రాలుగా మలచబడినవి. క్రొత్తగా మంత్ర దీక్ష పొంది కృషి చేయువారికి మార్గదర్శకంగావుండి అనుష్ఠాన ఆచరణ విచారణయందు కొన్ని రోజులు ఈ కేంద్రములద్వారా శిక్షణను ఒక ప్రోగ్రాము ద్వారా నేర్పి వారి ఇంటి వద్ద కూడ ఈ క్రమము పాటించేలా శిక్షణ ఇవ్వబడుతున్నది. ఈ శిక్షణలో భార్యాభర్తలిద్దరిని భాధ్యులుగా చేసి గృహస్థధర్మాచరణలో ఎట్టి ఆటంకాలు రానివ్వకుండా గురువు ఆజ్ఞనుసారంగా జీవిస్తూ, భుక్తిముక్తి క్రియలందు పరిపూర్ణత్వాన్ని సాధించగలిగే విధానము ఒక ప్రణాళికగా సిలబస్ ద్వారా నేర్పబడుచున్నది. అందుకు వీలుగా శిక్షణ జరుపుటకు పైన ఉదహరించిన గృహస్థధర్మంలో వుండి గురుపీఠ ప్రతిష్ఠాపన జరిగిన దంపతులను తీర్చిదిద్ది వారిని శిక్షణాధికారులుగా నియమించుట జరిగినది. గురూపాసన, గురుగీత పారాయణ వీటి ప్రభావాన్ని సమాజంలో సర్వులకు తెలియచేయుటకై కొందరి భక్తుల స్వగృహాలలో కూడా గురుపీఠ యంత్ర ప్రతిష్ఠ కార్యక్రమములు ఏర్పాటు చేసి అందు ప్రతినిత్యము ఉపాసనాకాండ విధానముగా కార్యక్రమములు నిర్వహించబడుచున్నవి. ఇందు ఇంటి యజమాని యజమానురాలే కాకుండా కుటుంబ సభ్యులందరూ భాధ్యత వహించేలా గురుధర్మ నిర్వాహణచే కుటుంబము భుక్తిముక్తి క్రియలందు శ్రేయోదాయకముగామారి పరస్పర అవగాహనకు అన్యోన్యతతో ధర్మాచరణకు పూనుకోవాడమే లక్ష్యముగా ఈ క్రింది ప్రాంతాలలో యంత్ర ప్రతిష్ఠలు జరిపి వారికి బోధాధికారాలు సంక్రమింపచేయబడినది.

| వ. సంఖ్య | పేరు | ఊరు | దీక్షానామములు |
| --- | --- | --- | --- |
| 01. | సర్వశ్రీ ఆరుగొండ విశ్వనాథం దంపతులు | హైదరాబాద్ | విధేయానంద |
| 02. | ఆనెం అప్పారావు దంపతులు | బరంపురం (ఒరిస్సా) | కార్యాకారణ నిరసనానంద |
| 03. | మల్కపల్లి సాంబశివకుమార్ దంపతులు | హైదరాబాద్ | ఆత్మానాత్మ నిరసనానంద |
| 04. | దాసరి నేస్తా దంపతులు | పాయకరావుపేట | దేహిదేహోపాది నిరననానంద |
| 05. | బొనగిరి ఉదయభాస్కరరావు దంపతులు | S.తిమ్మాపురం | ధర్మాధర్మ నిరసనానంద |
| 06. | తోట రంగారావు దంపతులు | గోనాడ | అహంకార నిరసనానంద |
| 07. | ప్రగళ్ళపాటి నాగ సుబ్బారావు దంపతులు | చాగల్లు | క్షర అక్షరోపాది నిరసనానంద |
| 08. | పమిడి పూల మల్లేశ్వర లింగం దంపతులు | వెనిగండ్ల | విద్యావిద్యోపాది నిరసనానంద |
| 09. | సామల పాపయ్య దంపతులు | కొప్పుల | జీవేశ్వరోపాది నిరసనానంద |
| 10. | రచ్చ భూమయ్య దంపతులు | బోధన్ | క్షేత్రాక్షేత్ర నంద నిరసనానంద |
| 11. | ద్వారా ఈశ్వరరావు దంపతులు | రాజమండ్రి | జ్ఞానాజ్ఞానోపాధి నిరసనానంద |
| 12. | మోకా దాయావతి | పూసలమర్రు | శివశక్తోపాది నిరసనానంద |
| 13. | గజం నర్సయ్య దంపతులు | నిజామాబాద్ | సదసదోపాది నిరసనానంద |
| 14. | కాండ్రు విష్ణు కుమార్ దంపతులు | విజయవాడ | సద్గుణానంద |

| | | | |
|---|---|---|---|
| 15. | మంచిరాజు కామేశ్వరరావు దంపతులు | యర్రబాలెం | |
| 16. | పూజారి మనోహరస్వామి దంపతులు | వరంగల్ | |
| 17. | మాటూరి వెంకస్వామి దంపతులు | హన్మకొండ | |
| 18. | ఓలం వీరభద్రరావు దంపతులు | కె.సముద్రం | |
| 19. | లగిశెట్టి జనార్ధన్ దంపతులు | సిద్ధిపేట | |

శివరామ దీక్షితీయ సాంప్రదాయమునందు "గురుకృప" అను అంశము కీలకమైనది. ఇట్టి గురుకృపకు గురూపాసన ప్రధమాంగము. "గురు సాక్షాత్ పరబ్రహ్మ" అను భావముతో గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠలే ధ్యేయంగా ఈ సాంప్రదాయమందు పెద్దలచే గురుగీతా ధర్మము ఒక సాధనాపరంగా నిత్యానుష్ఠాన పద్ధతియందు నిర్దేశింపబడియున్నది. "సుజ్ఞాన దీపమును గురుగీతలు" సాంప్రదాయక పీఠ గ్రంధముగా ప్రచారములోనికి తీసుకురాబడినది. ఇందు గురుకృపాప్రసాద సిద్ధియే లక్ష్యంగా గురుమాలా మంత్ర నిర్మాణంతో కూడిన తొలి అధ్యాయము నిర్ణయింపబడినది. ఇట్టి మంత్రము ఉపదేశక్రమంలో మంత్ర దీక్షగా గైకొని దీక్షా బద్ధంగా ఉపాసింపవలసియున్నది. మంత్రమునకు యంత్రము శరీరము వంటిది. దీనిని తంత్రయుక్తంగా బీజప్రాయముగా నున్న మంత్రశక్తిని సాధకుడు ఉపాసనా విధానం ద్వారా పొందవలసియున్నది. అందుకనువుగా శివరామ దీక్షిత పీఠాధ్యక్షులైన శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి ప్రియ శిష్యులు

వేదాంత సరస్వతి అభినవ దీక్షితులు అను బిరుదాంకితులైన శ్రీ కడివేటి నరసారెడ్డి గారు "ఉపాసనాకాండ " అను మకుటముతో మంత్ర, యంత్ర, తంత్ర, శాస్త్రములకనుగుణముగా ఒక నిర్దుష్టక్రమమును నిర్దేశిస్తూ పీఠ గ్రంథముగా ప్రకటించిరి. గురు పరంపర వార్షికోత్సవ సందర్భములోనూ పాటించేలాగున పీఠాధిపతులచే నిర్దేశము గావింపబడెను. ఈ గ్రంథమునందుపై అంశములే గాక స్వయంగా గురుపూజా విధానము రచించి అందు ప్రకటించుటతో పాటుగా వారికున్న సంస్కృత భాషా ప్రాభవమును జోడించి ఆనంతోపనిషత్తు సర్వసారోపనిషత్తులకు తెలుగులోకి వ్యాఖ్యానము వ్రాసి అందు ప్రకటించిరి.

పీఠము సాంప్రదాయమునకు ప్రాణము వంటిది. అందలి ఆధ్యాత్మిక విలువలకు భోధనా క్రమమునకు ఆచార విచారములకు జీవన విధానమునకు కేంద్రముగా చెప్పబడును. దీక్షిత సాంప్రదాయమునందు గురూపాసన అత్యంత ప్రముఖమైనది.

శ్లో ॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు, గురుర్దేవో మహేశ్వర:
గురు సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమ:

అను మంత్రము యధాతధంగా పోషింపబడును. ఏలననగా "గురోర్ముఖేన జ్ఞాతవ్యం అను శృత్యానుసారముగా పరిపూర్ణ భావము ఉన్నదున్నట్లుగా గురుముఖాతా మాత్రమే ధృఢపరచుకొనవలసియున్నది. " గురు ప్రక్తేస్థిత: బ్రహ్మ ప్రాప్యతే తత్ర్పసాదత: అని గురుగీత యందు పేర్కొనబడుచున్నది. కనుక గురూపాసన ఈ పీఠమునకు అత్యంత అవలంబనీయమైయున్నది. తాను ఉపాసించే ఉపాస్యముయొక్క సమస్త కళ్యాణ గుణములు, ఉపాసనా విధానము ద్వారా ఉపాసకుడు కలిగించుకొనుటయే ఇందలి విశిష్ఠత. తద్వారా దైవ కృప (ఈశ్వర కృప లేక గురుకృప)

సిద్ధించి పరిపూర్ణ భావము నందు ఆరూఢత చెందగలరు. ఇందుకనువుగా అనుష్ఠాన పద్ధతి ఉపదేశ క్రమమునందు చెప్పబడుచున్నది. నిత్య జీవన విధానమందు దీనిని ప్రవేశ పెట్టుకొని క్రమ పద్ధతిలో గురుర్వాక్యం యధాతధంగా పాటించి, పోషిస్తూ లక్ష్యశుద్ధి గావించుకొనవలసియున్నది. ప్రతిదినోత్సవము, పక్షోత్సవము, మాసోత్సవము, వార్షికోత్సవము పేరిట ఈ గురుగీతా ధర్మము ఆధారంగా (నాలంబనగా) చేసుకొని పీఠము, పాదుకలు, ఛాయాచిత్రము, యంత్ర నిర్మాణము మున్నగు అంశములు చోటు చేసుకొని పాటింపబడుచున్నవి. ఇందు ప్రభాతసేవ, గురుపూజ, గురుగీతా పారాయణము, గురు మంత్ర జపము, దినచర్యలుగాను పౌర్ణమి తిధియందు మాసోత్సవముగాను సంవత్సరమునకు వార్షికోత్సవముగాను కార్యక్రమముల రూపకల్పనగావింపబడిఉన్నవి. ఇట్టి వార్షికోత్సవము నందు గురు పరంపర ప్రారంభమునుండి అనగా శ్రీ బ్రహ్మ విద్యా గురువు నుండి తన ఉపదేశ గురువు వరకు అస్మద్గురు సమారంభం కృష్ణ సాందీప మధ్యమాం శ్రీ మహా విష్ణు పర్యంతాం వందే గురు పరంపరాం వరకు గల పరంపరా గురువులను పూజించి, అర్చించి సేవించి సాంప్రదాయక చిహ్నమైన జెండాకు వందనముగావించుట. ఈ విధానమంతయు ఉపాసనాకాండ అను గ్రంధమునందు చూడవచ్చును. ఈ గ్రంధమును వేదాంత సరస్వతి అభినవ దీక్షిత బిరుదాంకితులైన శ్రీ కడివేటి నర్సారెడ్డి గారు రచించిరి.

జెండావందనము అనునది ఓ సాంప్రదాయమునకు ఒక గుర్తుగా చెప్పబడుచున్నది. అందు అందలి విలువలు కూడా ముడిపడియున్నది. జెండాకు వందనము చేయుట అనగా ఇట్టి విలువలను ఆశయాలను, గౌరవించి వాటియందు

పవిత్రత, పూజనీయత, చేకూర్చుటకు ఒక కార్యక్రమముగా పెద్దలచే నిర్ణయించబడినది. ఈ పీఠమును శ్రీ దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారు స్థాపించి 1950 సం॥లో చట్టబద్ధముగావిస్తూ ఈ జెండాకు ఒక రూపకల్పన గావించి సాంప్రదాయమందలి ఆశయాలకు పారమార్థిక లౌకిక విలువలను సమాజానికి చాటి చెప్పుచు, ముదురు నారింజ పండు రంగు గుడ్డపై ప్రణవమునకు ముందు వెనుక రెండు సున్నలు కలిగించి, పీఠమందు గురువుతో సమానముగా దీనికి పూజనీయత ఏర్పరచి ఆశ్రమ వార్షికోత్సవ సందర్భమునందు జెండావందనము అనుకార్యక్రమము ద్వారా ఆ విలువలను అందరికి తెలియులాగును పాటింపచేయు కార్యక్రమమునకు రూపకల్పన గావించియున్నారు. ఇందు ఇహపరములందు త్యాగమునకు చిహ్నముగా ఈ రంగు రూపకల్పన గావింపబడినది. దీక్షిత సాంప్రదాయమైన మహాసభలు ఆశ్రమ వార్షికోత్సవాలు జరిపినపుడు చివరగా జెండావందనము నిర్వహించులాగున ఏర్పాటు చేయబడినది.

# మంత్రదీక్షను ఉపదేశించు విధానము

1.సర్వసాధారణముగాపౌర్ణమి,ఏకాదశి,తిథులలోనే ఉపదేశము చేయాలి.దంపతు -లిరువురూ ఏకకాలంలో మంత్రదీక్ష తీసుకోవడం చాలా విశేషము అవసరము.

2. ఉపదేశము పొందేవారు, చేసేవారు ఉదయంపూటఅయితే, ఉపవాసదీక్ష పాటించవలసి ఉంటుంది.

3. ఉపదేశము చేసేవారు, వారిఉపదేశ గురువునకుకానీ, గురుపీఠమునకుకానీ ముందుగా పూజచేసి, వారు గురుపీఠమును అలంకరించి, గురుమంత్రధ్యానము నందుండవలెను.

4. గురుపూజ చేసేవారు, శ్రద్ధ, భక్తి కలిగి అర్పణభావముతో నుండవలెను.

5. పూజానంతరము ఉపదేశికుడు (మంత్రదీక్ష తీసుకొన్నవాడు) లమిత్యాదిపంచ పూజలతో గురుపాదములకు సాష్టాంగ నమస్కారము చేసి, తన రెండు చేతులతో గురుపాదముల బొటన వేళ్ళను స్పృశిస్తూ ఏకాగ్రత కలిగి ఉండవలెను. (నమస్కార విధానము వివరించవలెను).

6. ఉపదేశించు గురువు హస్తమస్తక సంయోగముగావించి, మంత్రాక్షతలను శిష్యుని శిరస్సుపై నుంచి మొదటిసారి (ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవిక శాంతి సిద్ధిరస్తు) "దీర్ఘాయుష్మాన్‌భవ అని, రెండవసారి ఈశ్వరానుగ్రహప్రాప్తిరస్తు అని, మూడవసారి "గురుకృపాప్రసాద సిద్ధిరస్తు" అని మనసులో భావిస్తూ, కుడి చెవిలో గాలిని ఊది, ఈ క్రింది విధానముగా మంత్రదీక్ష ఉపదేశించవలెను.

1.గురుబ్రహ్మా గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః

గురు సాక్షాత్ పరబ్రహ్మా తస్మైశ్రీ గురువే నమః

గురు మాలా మంత్రము :

2. ఓం నమః శ్రీ గురుదేవాయ పరమపురుషాయ
సర్వ దేవతా వశీకరాయ, సర్వారిష్ట వినాశాయ
సర్వమంత్రచ్ఛేదనాయ, త్రైలోక్యం వశమానాయస్వాహా ॥

ద్వాదశి :

3. ఏతన్మిథ్యా శుద్ధవియత్ కించిన్నాస్తి
(ఈ ఉత్తబట్టబయలు ఏమిలేదు)

షోడశి :

4. నిర్మూలమేతథా, జ్ఞానశ్చరీరం నాస్తి కేవలం
(మూలంలేని యీ గుర్రైరిగే శరీరం యేమి లేదు)

7. సంస్కృతవాక్యములు ఉపదేశించి, తెలుగులో ఈవాక్యములను జపము చేయించవలెను. గురుపత్నియున్నచో ఆమె గూడా "దీర్ఘాయుష్మాన్ భవ" అని ఆశీర్వదిస్తూ 3 పర్యాయములు అక్షతలు వేయవలెను.

పై విధానము పూర్తిఅయిన తరువాత ఉపదేశికుడు (మంత్రదీక్ష తీసుకొన్నవాడు) మరల సాష్టాంగ నమస్కారము చేయవలెను.

8. ఉపదేశ గురువు మూడు దఫాలు తీర్థమును
శ్లో॥ అజ్ఞాన మూల హరణం జన్మకర్మనివారకం
జ్ఞానవైరాగ్య సిధ్యర్థం గురోఃపాదోదకంపిబేత్

అను శ్లోకమును చదువుతూ తీర్థమును "ఆత్మాఉః, ఏకస్సన్, ఏకత్రయం మనఃప్రాణవాచాసంఘాతంసత్తా అని, ఆత్మానాం ఆకాశసంభూతః, ఆకాశాది వాయుః వాయురోరగ్నిః అగ్నిఆపః, ఆపఃపృథ్వీనాం ఓషధః, ఓషధీభ్యం అన్నం,అన్నాత్ పురుషః" అనుమంత్రమును మనసులో భావిస్తూ ప్రసాదమునీయవలెను.

9. పైవి స్వీకరించిన పిదప శిష్యుడు గురుపీఠమునకు, హాజరైన బోధాధికారులకు నమస్కారము చేయవలెను.

10. గురువు ఉపదేశించిన మంత్రములను,ఒక్కొక్కటి 11 పర్యాయములకు తగ్గకుండా గురువు తాను చెపుతూ శిష్యుని చేత చెప్పించవలెను.

గురువు తనకపదేశించిన మంత్రములను, బోధపరమైన రహస్యములను గురుని అనుమతి లేనిదే అన్యులకు చెప్పరాదని శిష్యునిచే ప్రమాణము చేయించవలెను.

# అనుష్ఠానము శిక్షణ

1.నాలుగుశుశ్రూషలు, అనగా స్థానఅంగఆత్మభావశుశ్రూషలను, విధి విధానమును వివరించవలెను.

2. ఉపదేశము పొందిన నాటి నుండీ 40 రోజులు గురుమంత్ర సాధన యందే (వాచిక, ఉపాంశు విధానము ద్వారా) శిక్షణ ఇవ్వవలెను.

3. గురుపరంపరా ధ్యానము, గురుగీత మొదటి అధ్యాయము చదివే విధానమును వివరించవలెను.

4. తాను చేయు నమస్కారము, విధి విధానము అందు ఇమిడియున్న శరణాగతితో కూడిన అర్పణభావమును వివరించవలెను. ఈ నమస్కారము ప్రతి నిత్యము నిద్రలేచిన వెంటనే రాత్రి పడుకునేటపుడు విధిగా పాటించవలెను.

5. ప్రారంభదశలో కనీసము ప్రతినెలకొకపర్యాయమైనా గురుదర్శనమునకు, గురుప్రబోధకు అందుబాటులో ఉండేలా శిష్యునికి ఉపదేశించవలెను.

6. రాజయోగ ధర్మంలో భుక్తిక్రియ,ముక్తిక్రియ అను రెండూ ప్రధానమైనవి. భుక్తిక్రియకు భంగం కలుగకుండా భార్య, భర్త, పిల్లలు, డబ్బు, జీవనోపాధి మొదలైన అంశాలు తనముక్తిక్రియ కృషికి అటంకాలు,అవరోధాలు, కాకుండా వాటిని చక్కదిద్దుకోవలెను.

7. శిష్యుడుకనబరచే శ్రద్ధ, భక్తులను గమనించి, మంత్రసాధన యందు తీవ్రతను పెంచుకొని ఏకాగ్రత సాధించవలెను. మానసిక జపమును వివరించవలెను.

8. అందుకు అనువుగా స్థూలముగా ఉపదేశింపబడిన గురుమాలా మంత్రార్థమును వివరింపవలెను.

9. మొదటి అధ్యాయముతో పాటుగా గురుగీతలోని 2,3,4 అధ్యాయముల ప్రాధాన్యతను ప్రయోజనాన్ని వివరిస్తూ పారాయణక్రమాన్ని నేర్పవలెను.

10. గురుమాలామంత్రమును, మొదటిఅధ్యాయము ప్రకారము అంగన్యాస, కరన్యాసములతో దీక్షాబద్ధముగా ఉపాసించు విధానమును వివరించవలెను. వ్యాసమంజరి నాల్గు భాగములు, గురుగీత మూడుభాగములు చదివి, గురుముఖత సందేహ నివారణ కావించకొనవలెను.

11. ప్రతిదినము మూడు పర్యాయములు అనగా తెల్లవారురఝామున, స్నానానంతరము, రాత్రి నిద్రపోయే ముందు 108 సార్లు తక్కువ కాకుండా దశలుపాటిస్తూ, దిశ,స్థానము, టైము, ప్రదేశము మార్చకుండా వాటి విలువలను ప్రయోజనాలను తెలియజేస్తూ పాటింపజేయవలెను.

12. మంత్రోపదేశము చేసిన గురుమూర్తి ఛాయాచిత్రమునకు ప్రతినిత్యము స్నానాంతరము లఘుపూజ గావించే విధానమును నేర్పవలెను.

## ఆచరణ

1. స్వకష్టార్జితముగా జీవించవలెను.

2. సాత్వికాహారమును స్వీకరించవలెను.

3. మనసు, వాక్కు, శరీరము అను మూడింటినీ పవిత్రముగా పరిశుద్ధముగా ఉండులాగున, వీటి పనులయందు అదుపు, పొదుపు కలిగి యుండవలెను. విషయచింతన తగ్గించి, మంత్ర చింతన పెరిగేలా బోధించవలెను.

4. వ్యవహారమునకు భంగము కాకుండా మనస్సును సదా మంత్ర చింతన యందే వినియోగించవలెను.

5. తోటి సోదరులు కలుసుకొన్నపుడు ఒకరికొకరు "శ్రీగురుభ్యోనమః" అని చెప్పుకొని సోదరభావమును పెంపొందించుకొనవలెను.

6. ఇతరులచేత తాను సేవించుకొనకుండా, తాను ఇతరులకు సహాయపడవలెను.

7. వృద్ధులకు అనారోగ్యవంతులకు తనకు చేతనైనంతలో తనకున్న ధనము, బలము, విద్యలను సేవాభావముతో అందించవలెను.

8. మననక్రియకు ఎక్కువ ప్రాధాన్యత నీయవలెను.

9. సోదరులు ఒకరితో ఒకరు సంభాషించుకొనునపుడు విషయవ్యవహారాల ప్రాధాన్యతను తగ్గించి, పారమార్థిక జీవనము గడుపుటకు తగిన విషయములను, గురుబోధద్వారా తామువిన్న అమూల్యమైన సంగతుల గురించి ఎక్కువ చర్చించుకొనవలెను.

10. రోజువారీ కృషి విధానములో కలిగిన సందేహాలను గురుముఖతః నివారించుకొనవలయును.

11. ఇతరుల యందు గల దోషములను ఎంచక, తన యందు అట్టి దోషములున్నచో వాటిని సరిదిద్దుకొనవలయును.

12. యాదృచ్ఛాలాభ సంతుష్టి కలిగి స్వార్థమును విడచి, భూతదయతో సదా సంతుష్టుడై జీవించవలయును.

## విచారణ

1. మంత్రదీక్ష పొందిన 6 నెలల తరువాత అనుష్ఠాన, ఆచరణ విధానము నేర్పి, అందలి అభివృద్ధిని గమనించి, విచారణ ప్రారంభించవలెను.

2. పాఠఃక్రమములు ఒక్కొక్కటిగా కంఠతా నేర్పి, అవి వచ్చిన తర్వాత భద్రాద్రి రామ శతక పద్యముల ఆధారముగా వాటి వివరణ చెప్పవలెను.

3. విచారణ అందలి దశలు :-

1. బ్రహ్మాండ పిండాండ విచారణ

2. జీవ శుద్ధి – సాంఖ్యము

3. ఇంద్రియ శుద్ధి – తారకము

4. శుద్ధులు:- స్థూల శరీర శుద్ధి, ఆసనము

5. ప్రాణ శుద్ధి – అమనస్కము

6. ప్రత్యగాత్మ శుద్ధి – మహావాక్య విచారణ

7. త్రిపృత్కరణి

8. కోశ విచారణ

9. శరీరము - అవస్థలు

10. తన్మాత్రల పరిశీలన

11. పంచాకాశములు

12. జీవేశ్వరజగదుత్పత్తి విధానము

13. పంచతన్మాత్రల రహితము

14. వస్తు నిశ్చయజ్ఞానము :- ఆకాశము వస్తు నిశ్చయః అనగా స్థాన, స్వరూప, స్వభావములు వివరించి ధ్యానపద్ధతిద్వారా దానిని అనుభవములోనికి తీసుకునిరాగలిగే విధానమును నేర్పవలెను.

15. ఆత్మనిశ్చయము :- స్థాన, స్వరూప, స్వభావములు, పంచాకాశ పద్ధతి ద్వారా ప్రత్యేకముగా వివరించవలెను. వివరణ :- ఈ పై రెంటినీ అనుభవములోనికి తెచ్చుకోవడానికి ధ్యాన పద్ధతి ద్వారా ధ్యానం ఎలా చెయ్యాలి?

అనగా భూతాకాశము తెర తొలగించి మహాకాశమును అనుభవములోనికి తెచ్చు విధానము ఈక్రమమంతా 6నెలల కాలములో ఒకప్రోగ్రాముగా వివరించవలయును.

16. మొత్తం పాఠఃక్రమములన్నీ ఒకసారి వ్రాసి ఇవ్వకూడదు.

17. పై అంశములన్నిటి యందు స్పష్టమైన అవగాహన ఆరూఢత కలిగిన మీదట పరిపూర్ణ సూచన అనగా అచలము, బయలు, పరిపూర్ణమును వివరించవలెను.

18. ఆపై కందార్థ విచారణ ప్రారంభిస్తూ అర్ధసౌలభ్యము కొరకు చదివే విధానము నేర్పి, కంఠస్థము చేయించవలెను.

19. శీర్షికల ద్వారా ఒకక్రమములో విచారణ చెప్పవలెను. ఆవిధాముగానే కందపద్యాలు.

20. ద్వాదశి, షోడశి మంత్రార్థ వివరణ.

21. వీటిని ధ్యాన పద్ధతిలో అనుభూతము గావించుకొని, పరిపూర్ణస్థితిని దృఢపరచుకునే విధానమును వివరించలెను.

22. అశరీర పద్ధతి, కర్తృత్వరహిత కర్మాచరణ వివరించవలెను.

23. పై అంశములన్నీ అనుభవములోనికి తెచ్చుకోవడాన్కి గురుభక్తి, గురుసేవ, గురునిష్టలను వివరించవలెను.

పరిపూర్ణసిద్ధాంతము-అందలివిచారణశైలి-పరిప్రశ్నమాలిక:-

1. అధిష్ఠానము, ఆత్మ అంటే ఏమిటి?
2. బ్రహ్మాండము అంటే ఏమిటి?
3. స్థూలము అనగానేమి? సూక్ష్మము అనగా నేమి?
4. అరూప భూతములు, సరూపభూతములు ఏవి?
5. పిండాండము అనగా నేమి?
6. పిండాండము బ్రహ్మాండములకు భేదమేమి?
7. అంశములకు గుణములకు సంబంధము ఏమిటి?
8. శరీరము అనగానేమి? అది ఎన్నివిధములు?
9. ఇంద్రియములు అనగానేమి?
10. చైతన్యము అనగా నేమి?
11. ప్రాణము అనగానేమి?
12. ప్రత్యగాత్మ ప్రకాశము అంటే ఏమిటి?
13. జీవ చైతన్యము అంటే ఏమిటి?
14. ప్రాణము, ప్రత్యగాత్మ వస్తు నిశ్చయ జ్ఞానము
15. పిండబ్రహ్మాండముల యొక్క సమన్వయము
16. శరీరశుద్ధి అనగానేమి? అది ఎట్లు కల్గును?
17. తారకయోగమందలి చక్రముల వివరణ
18. హంస సంచారము ఈ చక్రముల నిరూపణ
19. బీజములు, దళముల వివరణ ఎట్లు?
20. బ్రహ్మాండము నందలి చక్రముల వివరణ ఎట్లు?
21. బాహ్య సుషుమ్న, అంతర సుషమ్న అనగా నేమి?
22. తారక యోగము వలన మనశ్శుద్ధి ఎట్లు కలుగును?
23. చక్రములు ఏ శరీర సంబంధమైనవి? వాటి నిరూపణ ఎట్లు?
24. సాంఖ్యము అనగా నేమి?

25. జీవత్వము, వస్తు నిశ్చయము
26. వ్యష్టి సమిష్టి అనగా నేమి?
27. జ్ఞానమనగా నేమి? దాని వస్తు నిశ్చయము
28. ప్రాణ నిర్ణయమెట్లు?
29. అమనస్కమనగానేమి? అది ఎన్ని విధములు?
30. అష్టదళ పద్మ నిర్ణయమెట్లు?
31. బ్రహ్మాండమందలి అష్టదళ పద్మ నిరూపణ ఎట్లు?
32. జ్ఞానమునకు, ప్రాణమునకు గల వ్యత్యాసమేమి?
33. ప్రత్యగాత్మ అనగానేమి? ప్రకాశము అనగానేమి?
    దాని ఉపాయందు దీని వ్యవహారమెట్లు?
34. చిదాభాసుడనగా ఎవరు?
35. బ్రహ్మాండమందలి పరమాత్మ నిర్ణయమెట్లు?
36. సాధన సంపత్తి అనగానేమి? సాధన చతుష్టయ సంపత్తి అనగానేమి?
37. తత్, త్వం, అసి వాటి వస్తు నిశ్చయము ఎట్లు?
38. ఘటాకాశము, మఠాకాశము నిరూపణ ఎట్లు?
39. జ్ఞానమునకు, ప్రజ్ఞానమునకు భేదమేమి?
40. నేను అను గుర్తు ఎట్లు ఏర్పడుచున్నది?
41. అయమాత్మ బ్రహ్మ అను మహావాక్యము యొక్క గూఢార్థము ఏమిటి?
42. మహావాక్యము ద్వారా కలిగిన జ్ఞానము ఎటువంటిది?
43. త్రివృత్కరణి అనగానేమి?
44. మనఃప్రాణ వాక్కుల వస్తు నిశ్చయము ఎట్లు? వీటి పరిశుద్ధత్వము ఏ రీతిగా (ఈ మూడింటియందు దీని త్రికరనములను ఆత్మమయముగా మార్చుకొనుట) ఎట్లు?
45. కోశము అనగా నేమి? అవి ఎన్ని కోశములు?
46. ఈ కోశములు యొక్క వస్తు నిశ్చయ జ్ఞానమెట్లు?
47. ఆరు కోశములు మూడు కోశములుగా, మూడు కోశములు రెండు కోశములుగా, రెండు కోశములు ఒక కోశముగా విచారణ ద్వారా మార్చుట ఎట్లు?

48. కోశ విచారణ ద్వారా ఆనందమంటే ఏమిటి? ఆనందానుభూతి పొందు విధానమెట్లు?

49. పంచకోశ వివేకము, ప్రత్యగాత్మ వ్యవహరిస్తున్న విధానమేమిటి?

50. అవస్థ అనగా నేమి? అవి ఎన్ని విధములు? వాని క్రమమేమి?

51. బ్రహ్మాండమందు, అధిష్ఠానమందు వీటి నిర్ణయ విధానమెట్లు?

52. శరీరము అనగానేమి? అవి ఎన్ని విధములు?

53. ఆత్మపాద, బ్రహ్మపాద చతుష్టయమనగా నేమి?

54. బ్రహ్మాండమందు, అధిష్ఠానమందు వీటి నిరూపణ ఎట్లు?

55. వస్తు నిశ్చయ జ్ఞానము ద్వారా అధిష్ఠానము నందు శరీరము, అవస్థల యొక్క నిర్ణయ విధానమెట్లు?

56. పంచతన్మాత్రల పరిశీలన ద్వారా ఆత్మ స్వరూప వస్తు నిశ్చయ జ్ఞానము పొందు విధానమెట్లు?

57. ఆకాశము అనగా నేమి? దాని వస్తు నిశ్చయ జ్ఞానమెట్లు?

58. పంచాకాశ విచారణ ద్వారా గ్రహించు ముఖ్యాంశము ఏది?

59. వర్ణములు (రంగులు) ద్వారా మహాకాశ స్థితిని గ్రహించుట ఎట్లు?

60. భూతాకాశ ఆవరణమును తొలగించి, మహాకాశ ఆవరణమును అనుభవము గావించుకొనుట ఎట్లు?

61. వస్తు నిశ్చయ జ్ఞానము ద్వారా పై రెంటికి భేదమును గ్రహించుట ఎట్లు?

62. ధ్యాన పద్ధతిలో సృష్టికి పూర్వము తాను తానైయున్న మహాకాశ స్థితిని గ్రహించు విధానమెట్లు?

63. ఈ అంశములే వేదాంత పరిభాషలో ఎట్లు నిర్ణయించినారు?

64. జీవ,ఈశ్వర,జగత్తుల నిరూపణ ఎట్లు?

65. మతముల యొక్క నిర్ణయ విధానము పై మూడింటి ద్వారా ఎట్లు ఏర్పడినది?

66. పురుషోత్తముడు లేక పరమపురుషుడు ఇతని వస్తు నిశ్చయ జ్ఞానము ఏది?

67. పై మూడింటి యందు ఏకత్వములో జీవించు విధానమెట్లు?

68. పంచతన్మాత్రల ఏకత్వములో జీవించు విధానమెట్లు?

69. ఆత్మ స్వరూప నిశ్చయము ద్వారా పంచతన్మాత్రల స్పర్శకులోను కాకుండా జీవించు విధానమెట్లు?

70. పాఠక్రమ సారాంశము ద్వారా గురుముఖతః గ్రహించు వస్తు నిశ్చయ జ్ఞాన విధానమెట్లు?

71. జన్మరహిత విధానమునకు పరిపూర్ణబోధయే మార్గమని గ్రహించగల్గు విధానమెట్లు?

72. ఆత్మాతీతం కేవలాత్మ అన్నట్లుగా, ఆత్మకు కేవలాత్మకు భేదము గ్రహించుట ఎట్లు? అచలము, బయలు, పరిపూర్ణము శబ్దార్థముల వివరణ ఎట్లు?

73. ద్వాదశి మంత్రము యొక్క వస్తు నిశ్చయ జ్ఞానము, దాని మంత్రార్థ వివరణ ఎట్లు?

ఎ) శోడశిమంత్రము యొక్క వస్తునిశ్చయ జ్ఞానము దాని మంత్రార్థ వివరణఎట్లు?

74) శోడషకళలు అనగా నేమి? వీటి పూర్ణత్వము ఎట్లు సిద్ధించును?

రహిత విధానమెట్లు?

75) పంచదశి మంత్రము నందలి దృష్ట ద్రాష్టాంతముల వివరణ. ఇవి శోడషి మంత్రములతో జతకల్పి వివరించు విధానమెట్లు?

76) నరస్వప్నమునకు, సురస్వప్నమునకు భేదము?

77) కందార్థ నిర్మిత విధానమెట్లు?

78) కంద పద్యముల నిరూపణ ఎట్లు?

79) పై రెంటి విచారణ ద్వారా బోధయందు ఆరూఢత ఎట్లు? ఏమి?

80) సర్వభ్రాంతి రహిత స్థితి గల్గు విధానమెట్లు?

81) (పరిపూర్ణబోధ) పరిపూర్ణము ఎరుకను ఎరిగి ఎరుకనుమాను అను అంశములలో కలుగు ఆరూఢత ఎట్లు?

82) ఇట్టి ఆరూఢత ద్వారా జీవించు విధానమెట్లు?

83) గురుభక్తి, గురుసేవ, గురు నిష్ఠ ఈ మూడింటి ద్వారా జీవించు విధానమెట్లు?

## గురుయంత్ర ప్రతిష్టలలో పీఠ నిర్మాణము జరిగిన చోట గమనించి పాటించవలసిన ముఖ్యాంశములు

1. పీఠయంత్రమునకు ప్రతినిత్యము పూజచేయవలెను. పీఠపూజ చేసేవారు స్నానమాచరించిన పిదప, ఉతికి ఆరవేసిన వస్త్రములను ధరించి, పరిశుద్ధ జలముతో పీఠమును, యంత్రమును శుభ్రము చేయవలెను. పీఠమును గంధము, కుంకుమ, పుష్పములతో అలంకరించి పూజాద్రవ్యములన్నీ సమకూర్చుకొని, అనుష్టాన విధియందలి శుద్ధులు గురుపరంపరలను చదివి, శ్లోకములతో షోడశోపచార పూజ చేయవలెను. సాయంత్రము పీఠమును, యంత్రమును యధాతధముగా ఉంచి లఘుపూజ చేయవలెను. ఉదయము మహానివేదనగా అన్నం + పెసరపప్పు, నెయ్యి, పెరుగు నివేదింపవలెను. సాయంత్రము పళ్ళు లేక పటిక బెల్లము నివేదన చేయవలెను. ప్రతిరోజూ పీఠశుభ్రత గావించలేనివారు, కనీసం ప్రతి గురువారంనాడైనా తప్పక శుభ్రము చేయవలెను. ప్రతిరోజూ పూజచేసిన అక్షతలను యంత్రముపైననే ఉంచి పూలను మాత్రమే తీసివేయవలెను.

2. పూజాకాలములో ధరించే వస్త్రాలతో మల,మూత్ర విసర్జన, ఫలహారములు, భోజనాదికములు చేయరాదు. జాతాశౌచము(పురుడు),మృతశౌచము(మైల) విధిగా పాటింపవలెను.

3. పీఠమును శుభ్రపరచునపుడు ఉపాసనాకాండయందలి గురుకవచమును చదువవలెను.

4. ప్రతి నిత్యము పూజానంతరము గురుగీత మొదటి అధ్యాయమును అంగన్యాస కరన్యాసాలతో పారాయణచేసి గురుమాలామంత్ర జపమును 108సార్లకు తగ్గకుండా జపించి, అక్షతలను కుడిచేతితో తీసుకొని "శ్రీమద్గురునకు గురుమంత్రానుష్ఠానసేవాం సమర్పయామి" అని ఆ అక్షతలను పీఠముపై వేయవలెను.

సాయం సమయపూజలో పూజానంతరం గురుమంత్రజపం చేసి అక్షతలను పీఠముపై వేయవలెను.

5. సాధ్యమైనంతగా మిగిలిన మూడు అధ్యాయములను పీఠమువద్దే పారాయణ చేయుటకు వీలు కల్గించుకొనవలెను.

6. స్వగృహములలో యంత్రప్రతిష్ఠ జరిగిన భార్యాభర్తలు, వారికుటుంబసభ్యులకు పీఠపూజా కార్యక్రమము ఈ సాంప్రదాయ పద్ధతి కనుగుణముగా అలవాటు చేసి, వారికి "ఓం నమో భగవతే శ్రీ సద్గురు దేవాయస్వాహా" అనుమంత్రమును తల్లితండ్రులే ఉపదేశించి పూజా విధానమును అలవాటు చేయవలెను.

7. నిత్యము జరిపే ఉపాసనాక్రమము,నిత్యోత్సవము,వారోత్సవము, పక్షోత్సవము, మాసోత్సవము, వార్షికోత్సవములందు అమావాస్య, మంగళవారము, శుక్రవారము, అష్టమి తిథులు రాకుండా జాగ్రత్త వహించవలెను.

8. మాసోత్సవము(పౌర్ణమి)తిథి రాత్రివేళ ఉండేలా వచ్చినపుడు పీఠము కదల్చకుండా రోజువారీ పూజచేసే పువ్వులు, అక్షతలు తీసివేసి పీఠమును శుభ్రపరచవలెను. ఆరోజు, రోజువారీ క్రమముతో పాటుగా అనుష్ఠానవిధియందలి ధరువులతో పూజించవలెను. స్థానిక భక్తులను విధిగా ఆహ్వానించి యధాశక్తిగా అందరూ కలసి ప్రసాధం స్వీకరించవలెను.

9. గ్రహణకాలములో పీఠముగల ప్రదేశమును పూర్తిగా మూసిఉంచి గ్రహణానంతరము పంచామృతములతో సంప్రోక్షణ జరిపి యధావిధిగా పూజాదికములు నిర్వహించవలెను. పూర్ణిమ, అమావాస్యలలో రాత్రిపూట, గ్రహణకాలములో ఉపదేశమంత్రమును విధిగా అనుష్ఠించవలెను.

10. వార్షికోత్సవములకు కావలసిన పూజాసామాగ్రి:- నవధాన్యములు, పసుపు, కుంకుమ, అగరుబత్తులు, హారతి కర్పూరం, గంధము, పువ్వులు, అక్షతలు, పూలదండలు, తమలపాకులు, వక్కలు,ఎండు ఖర్జూరపుకాయలు,పసుపుకొమ్ములు, చిల్లరనాణెములు అరటిపండ్లు,కొబ్బరికాయలు,పంచామృతములు (ఆవుపాలు, ఆవుపెరుగు, తేనె, నెయ్యి,పంచదార) తొమ్మిదిగానీ, ఏడుగానీ పళ్ళరసాలు, పంచగంగలు, మహానైవేద్యం (దధ్యోజనం,క్షీరాన్నము)

11. వార్షికోత్సవమును జరిపించేవారు, చేసే వారు ఆ రోజు ఉదయం నుండి ఉపవాస దీక్ష పాటింపవలెను. అనారోగ్యవంతులు ద్రవాహారమును తీసుకొనవచ్చును.

12. వార్షికోత్సవ కార్యక్రమమునకు ఉపదేశ గురువులను, పీఠఅధ్యక్షులవారినీ, మిగిలిన చోట్ల యంత్రప్రతిష్టలైన వారినీ,గ్రామములోని భక్తులను విధిగా ఆహ్వానించవలెను. వారితోపాటు ఆసక్తిగల భక్తులను బంధుజనములను ఆహ్వానించి శక్త్యానుసారముగా వారిని ఆదరించవలెను.

13. యంత్రమునందలి ప్రాణప్రతిష్ఠ గావింపబడిన బీజాక్షరమంత్రములు, అందలి నిర్మాణము గురుముఖతః విధిగా గ్రహించవలెను. అంతేగాక గురుగీత మొదటి అధ్యాయము చదివి,గురుమంత్రజపము పూర్తి అయిన తరవాత యంత్రమందు లిఖింపబడిన మంత్రములను ఒక్కొక్కటి 11 సార్లకు తక్కువ గాకుండా జపించి ఆ మంత్రాక్షతలను పీఠముపై ఉంచి నమస్కరించవలెను.

14. గురుయంత్రమందు బీజాక్షరములతో కూడిన 7 మంత్రములు కలవు.

1. ఓం నమో భగవతే శ్రీ సద్గురుదేవాయస్వాహా

2. ఓం నమో నారాయణాయ

3. ఓం నమఃశివాయ

4. ఓం నమోబ్రహ్మణే

5. ఓం

6. హం సః శివః సోహంః హంసః

7. ఐం క్లీం సాం సౌం క్లీం ఐం

వార్షికోత్సవ సందర్భములో ఈ క్రింది ప్రాణప్రతిష్ఠా మంత్రమును గురుకవచముతో సహాపారాయణ చేయవలెను.

**ప్రాణ ప్రతిష్ఠ :-**

ఓం,అం,హ్రీం,క్రొం,య,ర,ల,వ,శ,ష,స,హ,ఓం, ఓంకార పీఠ గురుచక్ర గురుపాదుక, ప్రాణ, యిహ, ప్రాణ, జీవ, యిహస్థితా,సర్వేంద్రియాణీప్రాణ, మమయిహైవ, ఆగచ్ఛ, ఆగచ్ఛ, అస్మిన్ ఓంకార పీఠ గురు గురుపాదుకాచక్ర మధ్యేసుఖం, చిదంతిష్టంతుస్వాహా ॥ఓం ప్రాణస్య శివం ప్రాణేశ స్వాహా॥

పైన వ్రాసిన ప్రకారం యంత్ర నిర్ణయం చేసి108 సార్లు జపం చేయవలెను.

## శ్రీసద్గురురక్షామాలా

1. ఓన్నమో భగవతే శ్రీగురుదేవాయ - నిజదేశికేంద్రాయ - మమ కుక్షిం ప్రవేశయ ప్రవేశయ; గృహకృత్రిమగ్రహా నుచ్చాట యోచ్చాటయ; శోషయ, శోషయ, మారయ, మారయ; జ్వాలయ-జ్వాలయ; పాదబ్జాం ఘట్టయ ఘట్టయ; భూతలోకలోకానాం ముఖం దహ-దహ, తంత్రగత భూతానాం మంత్రగతభూతానాం ఉచ్చాట యోచ్చాటయ్య; ఓం సహస్రారం ఖేంఖేం - హూం హూం - పట్ - పట్ శ్రీ సద్గురు దేవాయస్వాహా,

## -:ఆత్మరక్షామాలా:-

2. ఓన్నమో భగవతే శ్రీగురుదేవాయ - నిజదేశికేంద్రాయ - కాలకామాది దాహాయమహాభర్గ భీషణ రూపాయ సర్వతోమాం రక్ష రక్ష-అచల పరిపూర్ణ పరమాత్మస్వరూపాయ స్వాహా,

## -:పరరక్షామాలా:-

3. ఓన్నమో భగవతే శ్రీగురుదేవాయ - నిజదేశికేంద్రాయ - ధగద్ధగిత ధరా ధరాంతర-జ్వల జ్వల - ప్రజ్వల ప్రజ్వల, కామాది షడ్వర్గ దుష్టదానవ భయంకర బ్రహ్మ రాక్షస, ఖేచర భూచర, ఆత్మరక్షాచర, అంతరిక్షాచర నిశాచర సంహారకాయస్వాహా

4. అంహ్రీంక్రాం-యరలవ-శషసహ-ఓన్నమో భగవతే జనన మరణ భ్రాంతిరహితాయ-పరిపూర్ణ సద్గురు రాజయోగీంద్రాయ- నిజబోధాగ్ని జ్వాలాయ విద్యుత్కోటి దీప్త స్వరూపాయ-అహంకార మమకార సంయుత దుష్టమానవ భయంకరాయ-ఊర్ధ్వరేతసే-ఓజ స్వరూపోజ్వలాయ-సహస్ర భాస్కర దివ్యప్రభాభాసురాయ-సర్వతోముఖాయ-పరమ పురుషాయ-క్షరాక్షరోపాధి ద్వయ దోషరహితాయ-పరాపర శక్తిద్వయ నిరాసకాయ-సచ్చిదానందాతీతాయ-నిర్ముక్తాయ తాపాగ్నిం ప్రహరణ-దహదహ-పరమంత్రాన్ నివారయ-నివారయ-సర్పవృశ్చికాదీన్

నాశయ-నాశయ-భల్లూక మృగాదన పుండరీక వృక పంచానన ఖడ్గశర భాదిహింసమృగాన్ మారయ-మారయ సర్వం దహదహ భస్మీకురు-భస్మీకురు శ్రీ గురుదేవాయ-పరమ పురుషాయ-నమో రక్ష-రక్ష-త్రైలోక్యం వశమానాయ స్వాహా.

5. ఓన్నమో భగవతే శ్రీగురుదేవాయ - అంతః కరణా విర్భూతా హంకార నివారణాయ-అఘోరభర్గమూర్తయే మహాజ్వాల మహోగ్ర మహాఘోర మహారౌద్ర, మహాభీకర-జ్వలజ్వల-ప్రజ్వల ప్రజ్వల-రరరర-లలలల-స్ఫుర స్ఫుర-ప్రస్ఫుర ప్రస్ఫుర-ధమధమ-ఢిమఢిమ-ఘుళుఘుళు-తరతర తనురూప-తనురూప చటచట-ప్రఛటప్రఛట-కహకహ-కిహికిహి-కుహుకుహు-ఋఋఋఋ-ఌఌఌఌ-వమవమవమ బంధబంధ-ఘూతయ ఘూతయ-హంహంహం రాంరాంరాం రీంరీంరీం-క్ష్రాంక్ష్రాంక్ష్రాంక్ష్రాం పరశక్తిం గృహ్ణాణ గృహ్ణాణ సురుసురు-హురుహురు ఖేంఖేం-అఘోరరూపాయ సర్వ శత్రూన్గ్రసగ్రస-మారీ స్ఫోటక క్షామాడాం బరాది బాధాః నికృంతయ-నికృంతయ-సర్వలోకభయం-పరవిద్యా శక్తిం గృహ్ణాణ గృహ్ణాణ సురుసురు హురుహురు పరమంత్ర తంత్రయాంత్రాదయ కృత్యాదీన్ దహదహ-భస్మీకురు భస్మీకురు క్రోంక్రోంక్రోంక్రోం క్షాంక్షాం -ఖేంఖేం- సర్వగ్రహ నిర్మూలాయ -ఆవేశయ-ఆవేశయ- ఆకర్షయ-ఆకర్షయ-బంధయ బంధయ-మారయమారయ-ఘ్రేం ఘ్రేం ఘ్రేం ఘ్రేం మారయ మారయ-ఖేంఖేం రంరం-హుంహుం ఫట్ఫట్ ఓన్నమశ్శ్రీ గురుదేవాయ-పరమ పురుషాయ సర్వదేవతా స్వరూపాయ-సర్వారిష్టవినాశనాయ-సర్వమంత్రచ్ఛేదనాయ త్రైలోక్యంవశమానాయస్వాహా.

ఓం



శ్రీ శ్రీ శ్రీ

విజ్ఞానానంద మంచిరాజు శ్రీనివాసమూర్తి రాజయోగి

## ఈ గ్రంథము ముద్రణ ద్రవ్యదాత



## శ్రీశ్రీశ్రీ సద్గుణానంద కాంద్రు విష్ణుకుమార్ రాజయోగి

Kumar Press NZB @ 90302 4694